





# నాటకాలు

భక్తి,జ్ఞాన,పురాణ,జానపద

# శ్రీరామ పాదుకలు





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050015766

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీరస్తు.    353

# శ్రీ రామ పాదుకలు.

## ఆఱుంకముల దృశ్యప్రబంధము.

ఇది


కంభమ్మెట్టు సీతాపతిరాయ

ప్రణీతము.



మొదటికూర్పు : 1,000 ప్రతులు.

బెజవాడ : ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు
క. కోదండరామయ్యగారిచే ముద్రింపఁబడియె.

**1933.**




[దీని వెల **12** అణాలు

శ్రీరస్తు.

# పీఠిక.



నాటకములు పదివిధములుగా శాస్త్రకారులు నిర్ణయించి యుండిరి. సంస్కృతభాషలో దశవిధనాటకములును గలవు. వానిని బలుమంది పండితులు, ఆంధ్రీకరించియు, స్వకపోలకల్పితనాటకములుగా వ్రాసియు లోకమునకు మహోపకార మొనరించి యుండిరి ఎన్నియో యాంగ్లేయనాటకములు తెలుఁగులోనికిని వచ్చినవి. ఆంగ్లేయకథలను దీసికొని నాటకములుగా నందఱో రచించిరి. ఎవరి భాషాచారములు వారి కింపు గొలుపునట్లే నాటకములును, ఆ యా భాషాచారములు గల దేశస్థులకే యింపుగా నుండును. సంస్కృతపండితులు సంస్కృతనాటకములను, ఆంగ్లపండితు లాంగ్ల నాటకములను, నాంధ్రపండితు లాంధ్రనాటకములను మెచ్చుచుండుట లోకప్రసిద్ధము.

బహుపండితపరికాండులను నటకులనుగాఁ గూర్చి విజయనగరసంస్థానాధ్యక్షులగు శ్రీ ఆనందగజపతి మహారాజావారు సంస్కృతనాటకముల నన్నింటి నాడించి లోకమునకు మహానందమును గలిగించిరి. తరువాత నా నాటకములను సరసపక్కిని విద్వాంసులగు కవులు ఆంధ్రీకరించిరి; గాని ప్రదర్శనమున గొనుగక యాంధ్రనటకులు విసుగుం జెందుచు వచ్చిరి. క్రమక్రమముగాఁ దమ యిష్టము వచ్చిన పద్ధతులతో నాటకములను రచించుటచే నాంధ్రదృశ్యప్రబంధములకుఁ గొంత ప్రచారము కలిగినది.

రాను రాను లోకము గానప్రియ మగుటంజేసి నాటకములలోఁ గీర్తనలు వెలసినవి. పూర్వము దమయంతి పద్యముతో నేడ్చినదా? చంద్రమతి కీర్తనతో విలపించినదా? సీత వృత్తముతో శోకించినదా? యని యాక్షేపించుచుఁ గొంద ఱింతకుమున్ను నాటకమంతయు వచనరూపముగనే వ్రాసిరి గాని యది సర్వజనసామాన్యానందమును గూర్పకపోవుటంజేసి యా రీతి నాటకము లంతరించినవి. వీని పరిణామస్థితిని గుర్తించి యీ నాటకమును కంభమ్మెట్టు సీతాపతిరావుగారు దేశకాలపాత్రముల ననుసరించి మృదుమధురవాక్యములతో గానానుకూలమగు కీర్తనలతో వ్రాసి రెండు మూఁడు సారులు, 'ఇంటగెల్చి రచ్చ గెలువవలయు' నని వారి స్వగ్రామమగు చేటపఱ్ఱులోనే ప్రదర్శించి చూచి పండితులు లోపము లని చెప్పిన ఘట్టములను సవరించి యేలూరున మహాజనసముఖమునఁ బ్రదర్శించి మన్ననఁ గాంచిరి. వీరు ప్రదర్శించిన తావులకు నే నన్నిసారులును గ్రంథకర్తలయాహ్వానమునఁ బోయి చూచుచు వచ్చితిని. ఇపుడు ముద్రణమునకు సిద్ధపరుపఁ జతురచతురసంయోగమున మరలఁ దిలకించుట సంభవించినది. ప్రదర్శనముల మూలమున శుద్ధపడి రసమును వెదజల్లుచున్నది. వీరికిది ప్రథమయత్నము. ఇంకను లోపము లుండవచ్చును; కావున రసజ్ఞులు మిత్రభావమునఁ దెలిపినచో ద్వితీయముద్రణమున నైన సవరించుకొన నగుపడును. ఇబ్బాలకవి దృశ్యప్రబంధము లనేకములను రచించునట్లు పరమేశ్వరుఁ డనుగ్రహించుఁగాక!

ఏలూరు,
1—1—1933.

క్రొత్తపల్లి సుందరరామయ్య,
లక్కవరాస్థానవిద్వాంసుఁడు.

# విజ్ఞాపనము.

ఆర్యమహాశయులారా!

నేను పాఠశాలలోఁ జదువుకొనుచుండునప్పటినుండియు నాంధ్రమున మిగుల వేడుకపడుచుఁ బఠనగ్రంథములేగాక, యుత్తమకవి విరచితగ్రంథరాజములను దీరిక వేళల నెల్లఁ జదువుచుండెడివాఁడను. బంగారమునకుఁ దావి తోడ్డైనట్లు మాతండ్రిగారగు కంభమ్మెట్టు శోభనాచలపతిరావుగారి బహుగ్రంథరచనము నాకుఁ బ్రోత్సాహమును గలిగించుచు వచ్చినది. అప్పుడప్పుడు ప్రాస్తావికపద్యములను జాటువులుగఁ గొన్నింటిని వ్రాసి నామిత్రులగు పండితకవులకు విన్పించుచు వచ్చితిని. ఆ యా సమయములయందు వారు ధోరణి చక్కఁగానున్నదనియు, విడువక మీ రిందుఁ గృషిచేయుచుండుఁడనియుఁ జెప్పుచు వచ్చుటచే నాకు మఱియు నాంధ్రకవిత్వమునందభిమానము మెండై యెవ్వరియొద్దనైనఁ గొన్నిదినములు కృషిచేయ నెంచితిని గాని కుగ్రామ మగుటచేఁ దగినగురుసమావేశము లభ్యముగాక కరణీకపుఁ బనులలో లగ్నము కావలసివచ్చుటచే స్వయంకృషిమీఁదనే యాధారపడవలసినవాఁడనైతిని.

నారచనయందును, నాయందును బ్రేముడినిఁజూపు నామిత్రులు కొందఱు "అయ్యా! మీ రొకనాటక మేదేని వ్రాసినయెడల మేము పఠించి ప్రదర్శింతు"మని బాధించుచు వచ్చుటచే శక్తిసామర్థ్యములను విచారించుకొనకయే సుహృద్వరుల ప్రోత్సాహబలమునే చేదోడు వాదోడుగఁ జేసికొని శ్రీరామచంద్రునిదయచే నెట్లో పూర్తి గావించితిని.

ఆంధ్రమన నాకుఁగల యానందమే యీకార్యమునుండి గట్టెక్కించెను; గాని దానికిఁ దగినసత్త్వ మించుకయు నాయొద్ద నేవిషయము

నను లేదు. నాలుగైదుపర్యాయములు పరిదర్శించి చూచుకొనవలసి వచ్చినను నామిత్రులు విసువుఁజెందక కాయకష్టములకోర్చి పాటు పడి పరిదర్శించి నన్ను మిక్కిలి గౌరవపాత్రునిగా నొనర్చినందులకు నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

నా యీనాటకమును రెండు మూఁడు సారులు విమర్శనా బుద్ధితోఁ జదివి, చేయవలసినమార్పులను నాకు బోధించి చాలభాగము దోషరహితముగానుండఁ బాటుపడిన బ్ర॥ శ్రీ॥ తిపల్లి సుందరరామయ్య గారికి నావందనములు.

నాగ్రంథరచన కిదియే ప్రప్రథమ మగుటంజేసి ప్రమాదవశము నంగాని, బుద్ధివశమునంగాని యెం దేనెరసు లున్నను నాకుఁ దెలిపి నారచనయం దట్టిలోపములు ముందుముందుఁ గలుగకుండునట్లు దయ సేయుదురుగాక యని రసజ్ఞులను బ్రార్థించుచుంటిని.

ఇట్లు సజ్జనవిధేయుఁడు,

కంభమ్మెట్టు సీతాపతిరావు,

గ్రంథకర్త.



# ఇందలి పాత్రలు

## పురుషులు

దశరథుఁడు, వసిష్ఠుఁడు,
శ్రీరాముఁడు, సుమంత్రుఁడు,
లక్ష్మణుఁడు, సిద్ధార్థుఁడు,
భరతుఁడు, గుహుఁడు,
శత్రుఘ్నుఁడు, పౌరులు.

## స్త్రీలు

కైక, సీత.
మంథర,

## సవరణపట్టిక.

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 17 | 13 | షోశడ | షోడశ |
| 18 | 12 | పట్టాభి పట్టాభిషేక | పట్టాభిషేక |
| ,, | ,, | సుముహూరము | సుముహూర్తము |
| 33 | 17 | పరిహాసమా | పరిహాసము, మా |
| 33 | 25 | నీవదాని | నీవద్దాని |
| 34 | 9 | నీ వెవరవిటి | నీ వెవరవిట్టి |
| 49 | 2 | ఉ॥ ఎంత | ఉ॥ ఎంతటి |
| 50 | 9 | జల్లు | వెదజల్లు |

# ప్రార్థనకీర్తన.

కేదార రాగము.

ప॥ పాహి మాం శ్రీకృష్ణ! పరబ్రహ్మ! మాం పాహి

అ॥ ప॥ పాహి వేణుగోపాల! పాహి! పాహి భక్తలోల!

చ॥ పారమార్థికాధార! పరంజ్యోతి తేజా!
శ్రీరమావిలాస! క్షీరాబ్ధిశయన! జయవదనా
మారుతీనటకసమాజ మంజులపోషా! ॥పాహి॥





శ్రీరస్తు.

# శ్రీ రామపాదుకలు.

## ప్రథమాంకము.

(దశరథుఁడు, వసిష్ఠుఁడు, సిద్ధార్థుఁడు.)

దశ—గురువర్యా! సప్తసంతానములలోఁ బుత్రసంతానమే శ్రేష్ఠతమ మైనది కదా.

గీ॥ పసిడిగజ్జెలు తనయుని భాషణములు
వెన్నమీఁగడలు సుతునివీక్షణములు
మెఱుపుతీవలు పుత్రుని మేనిహొయలు
సుమసమానము ల్సూనుని సోయగములు.

వసి—రాజేంద్రా! ఉత్తమపుత్రప్రాప్తిఁ గాంచిన నీ జన్మమే జన్మము. నిన్ననుసరించి మే మెల్లరము ధన్యులము. శంఖచక్రగదాధారియు, శేషశాయియు, సర్వలోకరక్షణదక్షుండును నగు శ్రీ మహావిష్ణువే శ్రీరాముఁడై నీకు జన్మించెఁ గదా. కొఱఁత యేమి?

సిద్ధా—సద్గుణపుంజంబులకుఁ బుట్టినిల్లగు శ్రీరామచంద్రునివంటి కొమరుఁ డొకఁ డున్నఁ జాలదే. ధర్మజ్ఞానవిహీనులౌ పుత్రు లేబదిలక్ష లున్న నేమి ప్రయోజనము? రాజేంద్రా! శ్రీరామమూర్తి యౌవనదశఁ గాంచి రాజ్యార్హుఁడై యుండెను గదా! ఏల పట్టాభిషిక్తునిఁ జేయరాదు.

దశ—సిద్ధార్థా! చక్కఁగాఁ బలికితివి. ఈ రాజ్యభారము మోయుట యందే వృద్ధతం గాంచితిని. శ్రీరాముని చేసే పట్టాభిషిక్తునిఁ గావించెదఁగాక.

సీ॥ శ్రీపతియేయైన శీలసంపన్నుఁడై
కదిసి భిక్షువునైనఁ గాచు పుణ్య
బాలుఁడే యోఁగాక పాకారినైనను
భండనంబున భంగపఱుచుధీరు
నేమైనను న్గాని యెంతకఠినమైన
నాయాజ్ఞఁ దలఁదాల్చు నమ్రశీర్షు
నాటపాటలనైన నన్నృతంబులాడని
నిత్యసూనృతవచోనియమపరుని

గీ॥ గురుల దైవంబుగా నెంచి కొలుచుభక్తుఁ
బ్రజలఁ బోషించుసత్క్రియాభారవహుని
శ్రీదు, శీలుని, శ్రీరాము, శ్రీకరముగ
రాజ్యలక్ష్మిఁ బాలింపఁగా రాజుఁ జేతు.

చేసే శ్రీరాముని బట్టాభిషిక్తుని గావించెద. ఇట్టితలంపుతోనే నాముద్దులరామునికై నే డిందు వేచియుంటిని. శ్రీరాముఁ డిపు డిందు వచ్చునే.

[శ్రీరామలక్ష్మణులు ప్రవేశము.]

శ్రీరా: లక్ష్మ:—తండ్రీ! యివే మాభక్తిపూర్వకసాష్టాంగవందనములు. (తండ్రికిని వసిష్ఠునకునునమస్కరింతురు)

దశ—నాయనలారా! మీ రిరువురొకరి నొక రెడబాయకుందురుగాక. (శ్రీరామునిఁ జేరఁదీసి) శ్రీరామా! ఇంత యాలసించితి వేల ? నీవు సమీపమునలేని క్షణ మొకయుగము గదా.

శ్రీరా— తండ్రీ ఇంతవఱకును నాతల్లి మునిసత్తముల చిత్తశుద్ధిని గుఱించి బోధించుచున్నది. నేను తన్మయత్వముఁ గాంచియుండుటచేఁ దడవయ్యెను.

లక్ష్మ— జనకా! ఈరాజ్యభారము నేడోరేపో మూపున మోయు వలసియున్న శ్రీరాముఁ డధికతన్మయత్వమున ముని యౌ నేమోయని భీతిల్లి వేగిరపడి నాయన్న నిందు దోడ్తెచ్చితిని.

వసి—బాలకులారా! మీయిరువురి భావములు సమంజసములే. రాజు ముని కావచ్చును, ముని రాజు కావచ్చును.

దశ — నాయనా! శ్రీరామా! నేను కడు వృద్ధుండనైతిని. ఈరాజ్యభార మింక మోయఁజాలను. మనగురువర్యుల యనుమతిని, సిద్ధార్థుని యాలోచన ననుసరించి రేపే నిన్ను రాజ్యాభిషిక్తుని గావింప నిశ్చయించితిని. రేపే నీపట్టాభిషేకమహోత్సవము సుమా.

లక్ష్మ— జనకా! ఇట్టి మంగళకరవార్త నాలకించినంతనే నేను తరించితి ననియే తలఁచెద. నాజన్మమధ్యమునం దిది యొక శుభదినము గదా! మీకు విశ్రాంతి నొసంగి ఎప్పు డీమహామహుఁడు జానకీసమేతుఁడై కనకసింహాసన మధిష్ఠించు నెప్పుడా లక్ష్మీనారాయణులఁబోలు శుభదంపతులపాదపంకేరుహంబుల జలంబులఁ గడిగి శిరంబునఁ జల్లుకొనెదనా యని వేచియుంటిని.

సీ॥ చేపెగా కరములు శ్రీకరంబులగుచు
శ్రీరామ సేవలఁ జెన్ను మీఱు
చేపెగా నయనంబు లేపారఁగాఁ గాంచు
శ్రీరాముఁ డలరార సింహపీఠి
చేపెగా వీనులు ప్రీతిఁ దలిర్పఁగా
రామకీర్తన మెంతొ రాణ వినును
చేపెగా చిత్తంబు శ్రీరామమయమౌచుఁ
దన్మయత్వముఁ గాంచు ధన్యముగను
గీ॥ చేపెగా జానకీరాము లేపుమీఱ
రాచఠీవిని ముద్దుగాఁ గ్రాలఁగలరు
చేపెగా రామభటుఁడనై ప్రియముమీఱఁ
గోరి కోదండపాణినిఁ గొలుచువాఁడ.

శ్రీరా—తండ్రీ!

సీ॥ నీయాజ్ఞఁ దలఁ దాల్చు నియమ మొక్కటె కాని
రాజశాసనములఁ బ్రోఁచ నెఱుఁగఁ
దల్లిసేవలఁ జేసి తనియుచుండుటె కాని
చతురంగబలముల సాకి యెఱుఁగ
భూజాత నీక్షించి మురియుచుండుటె కాని
భూభారము వహించు భుజ మెఱుంగ
ముద్దుతమ్ములఁ గూడి మోదమందుటె కాని
చతురంగబలముల సాకియెఱుఁగ

గీ॥ దైవమూర్తు లలరు పీఠతలమె కాని
భయదసంగ్రామభూములఁ బ్రబలి యెఱుఁగ
ఈవసిష్ఠాదిదివ్యమునీంద్రకోటి
కెఱుఁగురీతినె కాని మఱేమి యెఱుఁగ.

అట్టిచో నే నీరాజ్యపాలనం బెట్లు చేయుదునో జనకా!

వసి— తమశక్తి తా మెఱుంగకుండుట యుత్తమపురుషలక్షణమే శ్రీరామా!

సిద్ధా— దేవా! శ్రీరామరాజు పాలింపలేని రాజ్య మేరాజు పాలింపగలఁడు!

లక్ష్మ— తండ్రీ! మా సోదరుఁ డెల్లపు డీరీతినే పలుకుచుండును. పట్టాభిషేకము గానిండు. తేపేనా ? జనకా!

దశ— అవును కుమారా లక్ష్మణా! శ్రీరామా! ముద్దుకుమారా! వసిష్ఠుని వంటి గురువర్యుండును, సుమంత్రునివంటి ధీమంతుండును లక్ష్మణునివంటి సోదరులును గల నీవంటి పరాక్రమసమేతుఁడగు నాపుత్రరత్నమున కసాధ్యముండునా? ఆశంకను మాని తేపటి పట్టాభిషేకమహోత్సవమునకు సంసిద్ధుఁడవు కమ్ము. నే నీభూభార మింక మోయఁజాల. నాకు విశ్రాంతిఁ గలిగింపుము.

శ్రీరా— తండ్రీ! మీయాజ్ఞకు బద్ధుఁడనే కదా.

దశ— కుమారా! శ్రీరామా! నీవు నేటిరేయి జానకీయుతుండవై యుపవాసముండి మనవసిష్ఠులవారు విధించిన రీతిని నారాయణార్చనముఁ గావింపుము.

శ్రీరా— తండ్రీ! అట్లే కావించెదను.

దశ— గురువర్యా! మీ రీకార్యము నిర్వర్తింపఁజేయుడని ప్రార్థించుచున్నాను.

వసి—రాజేంద్రా! అవశ్య మట్లే.

దశ—లక్ష్మణా! భరతుఁ డూరలేడు కదా. నీవే యీకార్యము సానుకూలముఁ గావింపుము.

లక్ష్మ—జనకా! నేను శ్రీరామభటుఁడనే కదా.

దశ—నేనును నాసతీమణుల కీ శుభవార్త నెఱింగించి వారి నల్లానందాంబుధినోలలాడించెదగాక.—ఇఁక నెవరిపనులకై వారలము పోవుదము.

[లక్ష్మణుఁడు కాక అందఱు నిష్క్రమింతురు.]

హిందూస్థాని ముఖారిరాగము - ఆదితాళము.

లక్ష్మ— ప॥ బళి మా రాముఁడు రారాజౌగా ॥బళి॥

అ॥ ప॥ విలువఁజెప్పఁగా నలవిగాని యా విభునిపాదముల్
నేను బట్టఁగా ॥బళి॥

చ॥ రామచంద్రుఁడా రామామణితో రాజగుచో నా
పుణ్యము పండున్
చామరంబు నా కరంబులఁ బూనెద ॥బళి॥

[లక్ష్మణుఁడు నిష్క్రమించును.]

ఇది ప్రథమాంకము.

---



# రామపాదుకలు.

## ద్వితీయాంకము

### 1 వ రంగము.

జంఝూటిరాగము - ఆదితాళము.

మంథ— ప॥ ఆ కేకలేమి ఆ జోకులేమి ఆ మూకలేమి
కనుగొన్న కడుపు రగులుగా॥
వెకలినవ్వులూ ఏక ఎగిరిపాటులు
చౌకరాకపోకలూ హద్దుపద్దులే దహా ఆ ॥ కేక॥
క్రొవ్విన వారల చెంపలు గొట్టిన
గవ్వలవలె పళ్లు హా రాలవా
ఎవ్వరి కేమని యీ పురవాసులు
గంతులువై చుచు నున్నవారో
మూఁడుపువ్వు లాఱుకాయ లన్నచందమందినారు ॥ కేక॥

ఏమి యలంకారము లేమి యలంకారములు! అయోధ్యాపురి యింద్రపురిని మించి యున్నదే! ఏ మూలఁ జూచిన కవ్వల బెక బెకలవలె పురజనుల వికవికలే! ఏ చక్కిఁ కిఁ బోయిన పకపకలే! ఏ వంక దిరిగిన గుసగుసలే! ఏ వీధి యందైన చకచకలే. రామ! రామ! ఆబాల గోపాల మానందతన్మయులే! శ్రీరాముని పట్టాభిషేకమఁట. శ్రీరాముని పట్టాభిషేకమే? ఈ మంథర మంట గలయునా? కైక కాలిపోవునా? భరతుఁడు నిరర్థకుఁడా? నేఁ జూచి సహింపఁజాల!

మంథ— వెఱ్ఱికి వేయివిధము లనినట్లు నీ కిది యొక వెఱ్ఱి. ఏ రాజేంద్రునకు ముద్దులదేవేరి నని కులుకుచుంటివో యట్టి నీ పతియే నీభవిష్యత్సంపదకు విఘాతుకుఁడు! ఏ శ్రీరాముఁడు సద్గుణధాముఁడని భ్రమించితివో యా శ్రీరాముఁడే నీశుభమార్గమునందొక కంటకతుల్యుఁడు.

కైక— అదెట్లు?

మంథ— ఎట్లా? నీపతి నిండుసభలో ఱేపే శ్రీరాముని పట్టాభిషిక్తుని గావింతు నని పలుకుటవలన. ఇప్పుడైనఁ గౌసల్యాదాసి వని యంగీకరింతువా?

కైక— (నవ్వుచు) ఇదియేనా మంథరా నీపరమరహస్యము. ఈమంగళవార్తఁ దెచ్చిన నీ కీ మౌక్తికహారము బహుమానముగా నిచ్చుచుంటిని గైకొనుము.

[కైక హార మీయ మంథర నేలపై విసరును.]

మంథ— లంకణములలో మనుగుడుపు లఁట. రానున్న కీడుఁ దలంచి గుండెలు పగులుచున్న నా కీమౌక్తికహారము బహుమానమా?

కైక— మంథరా! నీ కేటి కీపిఱికితనము.

మంథ— నీక్షేమాభివృద్ధినిఁ గోరు తెలివిమాలినదాన నగుటవలన.

కైక— శ్రీరామునిపట్టాభిషేకము నా కేల క్షేమదాయకముగాదు?

మంథ— అదియును దెలుపవలయునా? ఇంతదనుక నీపతిచేత రాజ్యముండుటం బట్టి నీవాట లాడుచుంటివి. కౌసల్యయు తనయంతరంగమునం దెట్లున్నను నీపతి ని న్నెక్కుడుగా వలచు నని గుర్తెఱిఁగి నీపైఁ గపటప్రేమఁ జూపుచున్నది. లేకున్న సవతికి ప్రేమయా? ఱేపు రాముని రాజుఁ గానిమ్ము చూతువుగాని.

కైక—మాతృభక్తిపరాయణుఁడౌ శ్రీరాముఁడు రాజైనను నన్ను గౌరవించునేగాని తదన్యముగాఁ జరింపఁడు.

మంథ—పాపము! పినతల్లివిగదా యని తన తల్లిని విసర్జించుకొనును గాఁబోలు! నీ మాట కేమిగాని నోరువాయిలేని భరతునిఁ బాడు సేయకుము.

కైక—శ్రీరామభరతుల సోదరవాత్సల్యము నీ వెఱుఁగనిదా! శ్రీరాముని తదనంతరమే భరతుఁడు రా జౌను. నే డేటి కీ తొందర?

మంథ—ఈమెట్టవేదాంతముల కేమిలే! శ్రీరాముని యనంతరము శ్రీరామునితనయులు రాజ్యార్హులుగాని, నీ తనయుఁ డెట్లు రాజగును? శ్రీరామునకు నందను లుదయింప రని నీవు జ్యోతిషముఁ జెప్పఁగలవా?

కైక—(ఆలోచించుచు) అదియు నిజమే.

మంథ—మఱే మనుకొంటివి? కొమరునిక్షేమముగోరు తల్లియే తల్లి. ఓమందమతురాలా! భరతుని రామరాజ్యమునకు బలిసీయకుము. శ్రీరాముఁడు రాజైన శ్రీరామతన్మయుఁడగు నీపతి నీకుఁ దక్కునా? కౌసల్యకుఁ జిక్కఁడా? సవతిసేవయే వాంఛింతువా? అభిమానము లేదా? నీయుప్పుఁగల్లు దినుచుండుటచే నింతగఁ బలికితిని; లేకున్న ఆవు దూడ యుండ గుంజ యఱచె నన్నట్లు నా కేల? నీయిచ్ఛవొచ్చిన మెలఁగుము. నేఁ బోయెద.

[మంథర పోఁబోవఁ గైక యాపును.]

కైక—దూర మాలోచించిన నీ వనున దిజమే యని తోచుచున్నది. నాపతికి నాపైఁగల మోహా మస్థిరమేమో యనికూడ శంక కలుగుచున్నది.

మంథ—కాకున్న నీభరతుని నీ పుట్టింటికిఁ బంపి రాముని పట్టాభిషేకముఁ దలపెట్టునా? భరతుఁ డున్న నభ్యంతరములు కలుగునేమో యని పంపివైచి శ్రీరామునిపట్టాభిషేకముఁ జేయబూనెను. ఇది దుస్తంత్రము కాదా?

కైక—రాముఁడు జ్యేష్ఠుఁ డగుటచే రాజ్యార్హుఁడు గదా! మన కిపుడు కర్తవ్య మేమి?

మంథ—అట్లడుగుము తెలిపెదను. తొల్లి దేవాసురయుద్ధములో నీవు నీపతి తేరు నడిపినపుడు నీకు వరద్వయ మీయలేదా? నీ వా వరముల నిపుడు కోరరాదా?

కైక—మంథరా! చక్కగా స్ఫురణకుఁ దెచ్చితివి. ఇపు డేమని కోరు మనెదవు?

మంథ—అంతమాత్ర మూహింపఁజాలవా? రాముఁడు జటావల్కల ధారియై పదునాల్గేం డ్లరణ్యవాసము సలుపవలయు ననియు, శ్రీరామునకు నియమింపఁబడిన పట్టాభిషేకము భరతునకుఁ జేయవలె ననియుఁ గోరుము.

కైక—వనవాసానంతరము మనకు మరల నిట్టి దుస్థితియే కలుగును గదా!

మంథ—ఓ వెఱ్ఱితల్లీ! భయదసింహ వ్యాఘ్ర భల్లూక రాక్షస వర్గం బులనుండి బ్రదికి బయటఁ బడినపుడు గదా! అది యసంభ వము.

కైక—ఎంతటియాలోచనాపరురాలవే! నీ ఋణ మెట్లు దీర్చు కొందునే!

మంథ—దాని కేమిగాని, విగతాలంకృతవై శిరోజములు వ్రేలాడవైచి చీఁకటింటిలో పరుండుము. నీ పతి నీ కడ కేతెంచినపు డలుకఁ బూనుము. నీ వరద్వయముఁ దీర్తు నని ముందుగా బాసఁ జేయ నిదే యలుక మానకుము. ఈ వరద్వయముఁ గోరుము.

కైక—మంథరా! నా పతి యాశితప్పునేమో కదా?

మంథ—దేవీ! అ ట్లెన్నఁటికిని జరుగదు. నీ పతి భవస్మోహపాశ బద్ధుం డగుటవలనను, సత్యసంధుం డగుటవలనను నీ వర ములఁ జెల్లించియే తీరును. పితాజ్ఞాపాలకుం డగు శ్రీరాముఁ డందుల కడుగు దాటఁడు. ఇదియే దీని పరమరహస్యము.

కైక—మంథరా! నా సందియము తీరినది. నీ వికఁ బొమ్ము.

మంథ—మనసు కలుగనీయకుమా! నే నిదే పోయి వచ్చెద. (పోఁబోయి) (మరల తిరిగి) దేవీ! దేవీ! నీ పతి ని న్నెంత వేడినను నీ వాంఛితము తీరసిదే లొంగకుమా! నీ నే ర్పిందు కనఁబడవలయును సుమా?

కైక— అట్లే చూతువుకాని; నీ విఁకఁ బొమ్ము.

[మంథర నిష్క్రమణము]

మాండ్ రాగము - ఆదితాళము.

కైక— ప॥ చేతఁబట్టలేనా నానాథుని ప్రణయకోప మూని మోహాంధుని॥

కుసుమకోమలాంగిన్ శుభాంగిన్
కొఱత నాకుఁ గలదా ఓ మన్మథ ॥చేత॥
అసాధ్య మదిగలదా స్త్రీజాతికి, ఆఁడుదాన నిఁక నే గానా
మోసగించి నేఁడే యావృద్ధుని ॥చేత॥
దరియకు మిఁక నను పోపో యని నేనే యలిగిన
అరనిముసంబున వరముల్ దీర్పఁడ ॥చేత॥

[కైకనిష్క్రమణము]

## 3 వ రంగము.

[కైక శయనమందిరమునందు నేలపై శయనించి యుండును.]
[ముంగిలిభవనమున దశరథుఁడు ప్రవేశము.]

దశ—నిత్యము మత్కరగ్రహణాకాంక్షియాభిలాషిణియై ముంగిలిభవనంబుననే నాకై వేచియుండు నాప్రియురాలు నేఁ డేలొకో యిందుఁ గానరాదే? శయనగృహాలంకరణమునం దప్రమత్తయై యుండనోపు. శయనగృహముఁ బ్రవేశించెద. (శయనగృహముఁ జేరి) ఈ మృదులపర్యంకముపై నానవమోహనాంగి లేదే! నేఁ డెం దేగియుండును. (ఆలోచించి) ఆహా! తెలిసె. మున్నిందే ముద్దులరాముని పట్టాభిషేకవార్త శ్రవణానందముగా విని బ్రహ్మానందమునఁ గౌసల్యతోఁ గలిసి యానందింపఁ జనియుం

డనచ్చును. ఇట్టి యానందసమయములలో నారీరత్నములే కదా యలంకారపాత్రలు. (ముందునకు నడిచి ఆకస్మికముగా ఆగి) ఆఁ ఏమి? ఈకటికనేలపై శయనించిన దెవరు? (సమీపించి) అయ్యో, నారీమణీ! నారీమణీ! ఏమిది? ఈదుస్థితి లేమి? శిరోజములు వ్రేలాడవైచితి వేల? అస్వస్థురాలవై యుంటివా? (కైక పెడమోమిడును) కైకా! అలుకయా!

మాల్కోస్‌రాగము - చాపుతాళము.

ప॥ అయ్యో, రమణి కళ్యాణీ ఏమాయెనే - చెలీ! యేమా
యెనే ఏమాయెనే చెలీ? భామామణీ.
పలుక వేలా! - అలుకేల బాలా!
వలపులరాణి వీవేకదా - నా - ప్రాణం బీవే కదా
నాబహిఃప్రాణమా పల్కాడవా నాతో పల్కాడవా
॥అయ్యో॥

కైక—నాథా! ఇది కౌసల్యాంతఃపురము కాదే? నాతో మీకేమిపని!

దశ—సుకుమారవల్లీ! ప్రణయకోపమా? తెల్లవారినంతనే శ్రీరామునిపట్టాభిషేకము సుమా! నీయందమిత వాత్సల్యముఁ జూపు శ్రీరాముని నీచేతులతో నలంకరించుపని నీకు లేదా!

ఉ॥ పూవులదండ గ్రుచ్చి వరపుత్రుని రామునికంఠసీమనున్
నీవె ధరింపఁజేసి కడునేర్పుగ దిద్ది "కుమారరత్నమా!
నీ వికఁ రాజు వౌదువొకొ నెమ్మది నన్ను దలంతువా?" యటం
చీ వికఁ ముద్దుముచ్చటల నింపుగఁ దేలవె! లెమ్ము కోమలీ.

కైక—రాజా! పరాభవాగ్నితప్తమా నామే నంటకుము దూరమున నున్న నా కదియే పదివేలు.

దశ—ఏమేమీ! పరాభవమా? ప్రియసఖీ! నీకా? ఎట్టితుచ్ఛుం డట్టి పనికిఁ బూనుకొనియె. సింహముతోఁ జెలగాటలా? ఎవఁడా దుర్బుద్ధి? యెవఁడా యదృష్టహీనుఁడు?

కైక—రాజా! గడ్డిపోచకుఁ గొఱఁగాని నాకై మీ రింతబాధపడ నేల? మీ యానందముననే మీ రుండుఁడు.

దశ—నా ప్రాణమే గదా నీ వరాంగీ! ఎల్లప్పుడును నీ దాసుఁడనే కదా. నీ కానందమే లేనిచో నా కానంద మెట్లు?

కైక—పురుషుల కిట్టి మృషాభాషణములు సహజములే కదా?

దశ—హా ప్రియసీ! నన్ను శంకింతువా? నా శపథ మిదే వినుము.

ఉ॥ ఏ సుకుమారువాక్సరళి యెంతయు ముద్దుల మాఁటగట్టునో
యే సుమబాణుని న్నిమిఱి యింపుగ ముంగురులొత్తుచుండునో
యే సుతరత్నలాలసరవిందు ప్రఁడగు న్ననముద్దుకుట్టఁడా
భాసుర రామచంద్రుపయి భామిని నే శపథంబుఁ జేయుదుర్.

ఈ వంగకోసలమగధాదిసమస్తధారుణీతలంబున నీవెద్ది కోరినను నీ ముద్దు చెల్లించెద. శ్రీరామునిపై నాన. దేవీ! కోరి కొనుము.

కైక—(సగము లేచి) నాథా! నిజమా? నిజమా?

దశ—శపథముఁ జేసితిని గదా.

కైక—అట్లయిన మున్ను దేవాసురయుద్ధములో మీరు నా కిడిన వరద్వయము మీ స్ఫురణయం దున్నదా?

దశ—సఖీ! యేల లేదు? నిన్ను మఱువఁగలనా?

కైక—ఆ వరముల నిప్పు డీయవలయును సుమా.

దశ—(తనలో) ఇట్టి యానందసమయమునం దెట్టి కోర్కులు గోరునో కదా.

కైక—(భుజముపైఁ జేయి వైచి) నాథా! శంకించుచుంటిరా?

దశ—ప్రియా! లేదు. ఆ వరము లెట్టివియో యని-

కైక—ఎట్టివైనను దీర్తు ననియే కదా బాసఁ జేసితిరి.

దశ— అవును, బాసఁ జేసితిని,

కైక—కోరుకొనవచ్చునా? విఫలముఁజేసి చిన్నఁబుచ్చరు గదా.

దశ—ఇంత గుచ్చి గుచ్చి యడుగ నేల? ఆడితప్ప నని యెఱుఁగవా (తనలో) దైవమా! శుభవాక్కులఁ బలికింపుము.

కైక—వల్లభా యిదే కోరుచుంటిని.

దశ—ఆందోళన మేల? ముమ్మాటికిని దీర్చెదను. శాంత మూనియే కోరుకొనవచ్చును.

కైక—ఓ పంచభూతములారా! మీరాలకించితిరి కదా నాపతి శపథము! ఓ దేవాదిదేవులారా! మీరే సాక్షులు. ఓ ఆదిమధ్యాంతరహితా! సత్యము గమనింపుము. నాథా! యిదే కోరుచుంటిని. మీరు చలించిన శ్రీరామునిపై నాన. నేను చలించిన భరతునిపై నాన.

దశ—(తనలో) దైవమా! కాపాడుము. (ప్రకాశముగా) సఖీ! అట్లే కోరికొనుము.

కైక—ప్రాణప్రియా! ఒక వరముచే శ్రీరాముఁడు నారచీరలఁ దాల్చి పదునాల్గేం డ్లరణ్యావాసము సలుప నేఁడే పురి వీడవలయును. రెండవ వరముచే ఈరాజ్యాభిషేకము భరతునకుఁ గావలయును. ఇవే నాకోర్కులు; తీర్పుము.

దశ—హా. రామా! (మూర్ఛిల్లి లేచి)

మ॥ కలయో కల్లయొ నామతిభ్రమయొ యీకళ్యాణి దయ్యంబొకో
లలనారత్నము కైక యేడ, సుఖలీలాపూరుషు న్బాలునిం
దొలఁగందోయుట దేడ, దైవమ! యిదే దోశోధనం బేమొ, మ
త్కులదీపాంకురమూర్తిమంతుడుఁ గదా కోదండ రాముం డయో!

ప్రేయసీ పరిహాసమా! పరిశోధనమా!

కైక—పరిహాసముకాదు, పరిశోధనము కాదు, పరమావధి.

దశ—నీ వీ వరములఁ గోర న్యాయమా!

కైక—నావరములఁ గొనుట దోసమా!

దశ—ఇంత కర్ణకఠోరములా ?

కైక—కర్ణామృతముగా వినరాదా!

దశ—ఈసమయముననా!

కైక—సమయము మించిననా?

దశ—ఓపయోముఖవిషకుంభమా!

సీ॥ భరతతుల్యుఁడు రామభద్రుఁ డనవె మున్ను
నాల్కయా పట్టెయా నాతి! నీది
తనతల్లితోఁబాటు మనసార సేవించు
రాముఁడా పగవాఁడు రమణి! నీకు
ముల్లోకముల్ రాము ముద్దాడ నెంచునే
తండ్రినైనే వానిఁ దఱుమవలెనె
త్యజియింతుఁ గౌసల్యఁ ద్యజియింతును సుమిత్రి
రాజ్యంబుఁ ద్యజియింతు రాము విడువ
గీ॥ కలికి! ముట్టిపెంపుచిఱునవ్వు మొలకలెత్త
వెలుఁగు నా ముద్దురామునా విడువవలయు?
విడువఁగాఁజాల నోబాల! విడువ విడువ
కాళ్లనైన నను బడియెదఁ గావలేవె?

కైక—సమస్తమండలాధీశుఁడైన రాజేంద్రునకీ శేలతనము సెల్లునా? పరులు వినిన నవ్వరా?

దశ—నవ్విన నవ్వుదురుగాక. నీ మానసము మరలింపుమా కోమలీ!

కైక—మరలించుటకే కోరితినా?

దశ—నాపై జాలిలేదా?

చ॥ కరములు మోడ్చి మ్రొక్కెదను కాంతరో! పాదములొత్తువాఁడ,
నోతరుణి! ధరాతలం బిపుడె ధారగఁబోసెద గవ్వ నొల్ల, న
న్దరుము మరణ్యసీమలకు, దండము నీకిడి పోవువాఁడ, నే
కరణినినైనఁ జాలిఁగొని కానల కంపకు ముద్దురామునిన్.

కై క—ఓహోహో! మీయుపాయ మెఱుంగలేనని తలఁచిరా? శ్రీరాముఁ డయోధ్యలోనున్న భరతుఁడు రాజైనను లాభ మేమి? పౌరులు శ్రీరామవశులేగదా యనియా మీయూహ? అందుల కంగీకరించుటకు కైకయే వెఱ్ఱిబాగులవనిత యనియా మీయాశయము? ఇదివఱకు సలిపినకుట్రి చాలక మరలకుట్రియా?

దశ—నే నిదివఱకు సలిపిన కుట్ర యేమి?

కై క—భరతుని పొలిమేర దాఁటించి శ్రీరామపట్టాభిషేకముఁ జేయఁబూనుట కుట్రకాదా?

దశ—సతీమణీ! నీ కీదురూహలఁ గల్పించిన మూఢు లెవ్వరో కదా!

సీ॥ "రామా" యనఁగనే కరముల జోడించి "ఓ
తండ్రి"యనుచుఁ బల్కి తనరువాఁడు
కనుసన్నఁ గనినంత గజ్జెలందెలు మ్రోగ
పరుగునఁ బదముల వ్రాలువాఁడు
లేవనెత్తకమున్నె లేలేతనవ్వుల
"పని యేమి" యని ప్రీతిఁ బలుకువాఁడు
ఇద మిత్థ మనినంత నేపారు భక్తితోఁ
గార్యార్థియై పోయి కడఁగువాఁడు
గీ॥ కనుమఱుంగైనఁ గనులకుఁ గట్టినటులె
లీలగాఁ దోఁపఁజేయుచుఁ గ్రాలువాఁడు
శ్రీమహావిష్ణువే యనఁ జెలఁగువాఁడు
రామచంద్రుఁ డడవి కేగ బ్రతుకు టెట్లొ!

కై క—భరతుఁడు మాత్ర మట్టి ప్రియుఁడు గాఁడా! మున్ను శిబిమొదలగు ధర్మపోషకు లిట్లే దుఃఖించిరా? ఈబేలతన మీవ్యామోహ మబలలమగు మాకుఁ జెల్లునుగాని మీకా? అబలనయ్యు నేనేచలించుటలేదే మీరంతకన్న హీనస్థితిఁగాంచుట చోద్యమే.

దశ—ఓ పాపీ! నీ మనస్సు కరుఁగదా?

కై క—మీకల్లబొల్లి యేడ్పులకే నా మనస్సు కరుగునా? రాజ్యరమను శ్రీరామచంద్రునకుఁ గట్టబెట్టి కౌసల్యమందిరమున శ్రీరాము

నితోఁ గులుకనెంచితిరి కాఁబోలు! "సోదరా సోదరా" యని రాముని వెన్వెంటఁ బరుగు భరతునివలెనే "అక్కా, అక్కా" యని కౌసల్యవెన్వెంట నన్నుఁ దిప్పనెంచితిరా? అట్లి న్నటికిని జరుగఁజాలదు.

దశ—నీవు చలింపవా ద్రోహీ!

కైక—మీరు శ్రీరామునిపై శపథముఁ గావించితి రని మఱచితిరా? నేను భరతునిపై శపథముఁ గావించు టెఱుంగరా? మీరు చలించినను నేను చలింపను సుఁడీ.

దశ— ఓ పాపీ! రక్కసీ! కూళా! పితృమాతృభక్తిపరాయణాగ్రేసరుండును, జగత్కళ్యాణావతారసుందరవిగ్రహాలంకారమూర్తిమంతుండును, వీరరసస్యందితావక్రపరాక్రమక్రమవిక్రమార్కుండును నా నాముద్దులరామునితో, నడవికేగుము రామా యనినంత, మదాజ్ఞానిగళబద్ధుఁడై షోడశకళాపరిపూర్ణపూర్ణిమాచంద్రవదనంబునఁ గళంకమైనఁ గాంచక, క్రూరజంతుసంతానసంయుతభీకరారణ్యంబుల కడలక, కందమూలంబుల కేవగింపక, గడుపునైనఁ గోరక, పాదచారియై యుగ్రాటవుల కేగుచో, శ్రీరాముని నే నీపాదుకన్నులఁ గాంచినంతనే, శతశతఘ్నికా విస్ఫోతగర్భదుర్భేద్యార్భటింబోలె గుండెలు వ్రీలి నేను మరణింపఁ గౌసల్యాసుమిత్రాత్మసతీపతివ్రతాశిరోమణులు విగతప్రాణలై నాకళేబరంబుపైఁ బడ, విధవా! యీధారుణీరాజ్యసర్వస్వంబు నీనెత్తికే కట్టుకొని నీపుత్రు నభిషేకింపఁ దలంచితివి కాఁబోలు.

సీ॥ గుడ్లగూబలుకూడి కూయుకూఁతలె నీకు
మంగళారవములై మారుమోగ
రుద్రభూమిని జేరి నిద్రించు నక్కలే
మంత్రివర్గంబులై మసలికొల్వ
మార్జాలసమితియే మంగళారతు లీయ
ముత్తైదులకు మారు మూఁగుకొనఁగ

జడదారులుం బోవ జేమ గబ్బిలంబులే
తలకిందులై యుండి తపము సలుప
గీ॥ విధవవై లజ్జ విడనాడి వెడలి నీవు
భరతపట్టాభిషేక మ హ్వరముఁ దీర్ప
సిద్ధపడు వేళ, వేచి యాచిన్నికొడుకె
తన్నుఁడా నిన్నెడమకాలఁ దనయుఁడైన?

ఓరక్కసీ! నీవు భీకరాగ్నిజ్వాలలఁ బడినను సరియే. మహో న్నతగిరిశిఖరంబులనుండి భూతలంబునఁ బడినను మేలే. విషముఁ గ్రోలినఁ గొల్లుము. నీకై నా రాముని విడువఁజాల. హా రామా! గుణధామా! ఘనశ్యామాభిరామా!

సుమం—(తెరలో) రాజేంద్రా! వేకువయైనది. శ్రీరామ పట్టాభి పట్టాభిషేకకార్యసుముహూర్తము సమీపించుచున్నది. నిండుసభ మీకొఱ కెదురుఁ జూచుచున్నది. దేవా! ఏమి సెలవు?

దశ—హా! భరింపఁజాల! భరింపఁజాల. సుమంత్రా! శ్రీరాముని వెంటనే యిటకుఁ బుత్తెంచుము.

సుమం—(తెరలో) చిత్తము.

దశ—ప్రియసతీ! యిఁకనైనను విరమింపుమా.

కైక—నాథా, వృథాయాసమేల? వరములఁ జెల్లించియే తీరవల యును.

దశ—ఓ శాకినీ! కటికిచీకటికైన నంతు కలిగినది, గాని నీదౌష్ట్య మున కంతులేకున్నదే. హా!

[మూర్ఛిల్లును.]

---

## 4 వ రం గ ము.

[కైక యేకాంతము.]

కైక—పాప మీనా పతి దుఃఖతప్తుఁడై మూర్ఛిల్లి యున్నవాఁడు నా కేలొకో జాలి పొడముచున్నది. శ్రీరాముఁడైనను నిక్క

ముగా పితృమాతృభక్తిపరాయణుఁడే. నే నీ వరమ్ములనుండి విరమింతునా? (ఆలోచించును)

[మంథర వెనుకనుండి ప్రవేశించును.]

మంథ—(సమీపించి) దేవీ! యే మాయాలోచన? పెడత్రోవఁ బట్టుచుంటివా?

కైక—మంథరా! ఏమియును లేదు. ఏలొకో జాలికలుగుచున్నది.

మంథ—జాలియా? ఎంత యవివేకురాలవు! జాలియా? జాలి యన నెట్లుండును?

కైక—ఏమైనను ప్రాణేశుఁడు గదా!

మంథ—అబ్బా! నీకే పతి యుండెనా? లోకములో నే రమణికిని బతి లేఁడా? పతిముందు పుత్రుఁడు పనికిరాకుండెను గాఁబోలు.

కైక—పతియును గావలయును, పుత్రుఁడును గావలయును.

మంథ—ఇదియా నీయాడంబరము? తుదకు రెంటికిం జెడిన రేవడి వగుదువు. ఇంత మోహాంధురాలవు మొదటనే యేల కోరకుండకపోతివి? ఎట్లైనను నీకు నింద తప్పదుగదా. వ్రతము చెడినను ఫలము దక్కించుకొనుము. సిద్ధాన్నముఁ బోర్లఁ ద్రోసికొనకుము. ఏమో చెప్పవలసి చెప్పితిని. అయినను భార్యాభర్తల మోహపాశముఁ ద్రెంపుటకు నాపుట్టేమి మునిఁగినది. నీయిష్టము, నీపతియిష్టము; ముఖమున్నది, అద్దమున్నది. మీ మీ యిష్టములు. నేఁబోయెద (పోఁబోవును).

కైక—(ఆపి) కాదు కాదు, మంథరా! ఊరక యంటిని. ఎంత సద్గుణవంతుఁడైనను రాముఁడు భరతుఁడు కాఁజాలఁడుగదా. కన్నకడుపుగదా భరతుఁడు.

మంథ—అంతయుఁ దెలిసి యధోలోకమునఁ బడుచుంటివి. "చెంకాయ పిచ్చికొండ్ల" సామెతగా నున్నది నీపని.

కైక—లేదు, లేదు మంథరా! ముమ్మాటికి నావరముల గ్రహించి యే తీరెదను. భరతునిపై బాసఁజేసితినిగదా!

మంథ—ఆఁ! దానిని మఱువకుము. ధైర్యమునఁ గార్యము సాధించిననే కైకమ్మవు.

కైక—అట్లే సాధించెద. శ్రీరాముఁ డిపు డిందు వచ్చును. నీ విఁకఁ బొమ్ము.

మంథ—ఈమాటు మరల జాలి యనకుమా! నేఁ బోయెద.

[నిష్క్రమించును.]

---

5 వ రం గ ము.

[కైక మూర్ఛిల్లియున్న దశరథునిచెంత నుండును.]

[శ్రీరాముఁడు ప్రవేశము.]

కైక—(ఆతురతతో) నాయనా! శ్రీరామా! వచ్చితివా!

శ్రీరా—తల్లీ! వచ్చితిని. తండ్రి న న్నేల తిలకింపఁడో కదా. ఎఱుఁగక నే నేమి తప్పుఁ జేసితినో కదా. తల్లీ! నీ వైనఁ దెలుపవా?

కైక—నాయనా! ఏమియును లేదు. నీ జనకుఁడు నాకు రెండువరముల నిచ్చి వానిని నీకుఁ దెలుప వెఱచుచున్నాఁడు.

శ్రీరా—తండ్రి తల్లికి వరముల నిచ్చుటయు, సుతునకుఁ దెలుప వెఱచుటయునా? తల్లీ! యిదేమి వింత! ఆ వరము లేవియో తెలుపవా?

కైక—నాయనా! ఆ వరములఁ బాలింతు నని ముందుగా నీవు బాసఁ జేయుదువేని తెలిపెదను. నీవు పితృభక్తిపరాయణుఁడ వనియు, ధర్మమూర్తి వనియు లోక మెఱుఁగును, నేనును నెఱుఁగుదును. అయినను బాసఁజేయుము.

శ్రీరా—తల్లీ! తలిదండ్రుల యాజ్ఞయే యయినచో

గీ॥ మలమల న్మాడు మంటల మ్రిగ్గువాఁడ
ఘోరవిషమును జేపట్టి క్రోలువాఁడ
సురుతరోదధినైన నే నఱుకువాఁడ
తల్లి! వరపాలనముమాటఁ దలఁప నేల?

కైక—అట్లయిన కుమారా! నీవు నారచీరలఁ దాల్చి పదునాల్గేం డ్లరణ్యవాసము సలుప నేఁడే పురి వీడవలయును; ఇది మొదటి వరము. భరతుఁడు రాజ్యాభిషిక్తుఁడు గావలయును; ఇది రెండవ వరము.

శ్రీరా—తల్లీ ఇంతటివే కదా వరములు.

సీ॥ కన్నారఁ బెంచిన కన్నతండ్రిని మీఱఁ
గలనైన మదినైనఁ దలఁప నమ్మ
తమ్ముఁడే భరతుఁడు ధరణినే యన నేల
ప్రాణమే యర్పింతుఁ బడయు మమ్మ
మునినైన లోభేమి మొదటిభిక్షను నీవె
యోఁడి బట్టినా నిదె విడువు మమ్మ
జనకుఁడే యననేల జననివే నీవైన
నొదిగిపోయెదఁ దలనూపు మమ్మ

గీ॥ జటల, నారచీరలఁ దాల్చి జనకునాజ్ఞ
నడవి కేగంగ దుఃఖంపనమ్మ కాని
వనట నొందుదు నాతండ్రి పలుకడంచు
భరతుఁ బిలువంగ భటులను బంపు మమ్మ.

కైక—రామా! భరతునితో నీ కేమిపని? నీవు దండకాటవికిఁ బొమ్ము. రఘుకులము కళంకముఁగావింపఁ దలఁపవేని, సుగుణశీలుఁడ వగుదువేని, నిక్కముగాఁ బితృభక్తిపరుండవేని, శీఘ్రముగా వరపాలనము సేయుము.

శ్రీరా—మాతా!

గీ॥ జనని నూరార్చి, యోదార్చి జనకపుత్రి
సాగివత్తు విలంబము సైపుమమ్మ

తండ్రిసేవయే తనయునిధర్మ మనుచు
భరతుతో నాదువాక్కుగాఁ బలుకుమమ్మ.

కైక—అవన్నియు నేను దిద్దికొనెదను లెమ్ము; నీవు చని వైళంబ రమ్ము. కాలయాపనఁ జేయకుమా!

దశ—హా! శాంతమూర్తి! నీకు నేను శనిగ్రహమనై దాపరించితినిరా తండ్రీ!

శ్రీరా—తండ్రీ! దుఃఖింపకుము. (సమీపింపఁబోవఁ గైక యడ్డగించును.)

కైక—నీతండ్రి కలువరింతలు లెమ్ము; నీ వేగుము.

శ్రీరా—తల్లీ! తండ్రితో నొకపలుకైన నాడరాదా?

కైక—పలుకవచ్చును నీవరణ్యములకుఁ బోవునపుడు. శీఘ్రముగాఁ బోయిరమ్ము. త్వరపడుము. విశేషకాలముండిన సహింపను సుమా!

శ్రీరా—తల్లీ! అట్లే. (జనకు నుద్దేశించి) తండ్రీ! మరల వచ్చెదను. దుఃఖింపకుము.

కైక—శ్రీరామా! ఇంకను ఇందే యుంటివా?

శ్రీరా—తల్లీ! యిదే పోవుచుంటిని.

[నిష్క్రమించును.]

[తెర పడు ను.]

ఇది ద్వితీయాంకము.



శ్రీరస్తు.

# శ్రీ రామ పాదుకలు.

## తృతీయాంకము.

### 1 వ రంగము.

[సీతారాముల ప్రవేశము.]

శ్రీ రా—జానకీ! నా జనని నెట్లెట్లో యూరడించి వచ్చితిని. ప్రేయసీ! ఆమె కీఁకఁ గుమారుఁడై నను గోడలై నను నీవేగదా. నీ వామె నె ట్లూరడింతువో.

సీత—నాథా! ఇది న్యాయమా!

గీ॥ చంద్రబింబము న్బాయునే చంద్రిక లెటఁ
బుడమి యంటక యుండునే పూర్ణజలధి
విష్ణుచక్రంబు తొలఁగునే విష్ణుకరముఁ
బతిని విడనాడి నిలుచునే సతి జగాన?

నన్నును మీ వెంటఁ గొనిపొండు.

శ్రీ రా—కుసుమవల్లీ! దుర్గమకాంతారము లన నీ వేమనుకొంటివి?

సీ॥ కాండ్రు కాంఱ్రు మని వ్యాఘ్రము లార్వ గర్జించి
సింహముల్ చెలరేగి చిందులాడు
బుస్సు బుస్సున ఫణుల్ పూత్కరింపంగ మ
యూరము ల్చెంగున నుట్టిపడును

భగ్గు భగ్గున వని నిగ్గుల మండుచో
నెలుఁగుగొడ్డులు భీతి నెగిరి దుముకు
హోరు హోరు మనుచు ఘోరవాయువు లేయ
గుప్పించి సుడిగాలు లొప్పి యెగయుఁ

గీ॥ గసికలు కసుక్కున స్గ్రుచ్చుఁ గదలినంత
బల్లెపుమొనలనే బోలు రాళ్ళగములు
కాలుమోపంగ శక్యమే కానలందు?
ముగ్ధ! నీ వింట నుండుమో ముద్దుబాల!

సీత—నాథా! నాముద్దు చెల్లింపుము. మిమ్ముఁ బాసినక్షణము జీవముల నిలుపఁజాల. లోకులు పలుగాకులు. శ్రుతిస్మృతులు పతిని వెన్నంటియే సతి యుండవలయు నని చాటుట లేదా? మీరు లేని యయోధ్య నాకేమి నిలయము? దుర్గమకాంతారములైన మీచెంతనున్న వైకుంఠమే గదా! నన్నుఁ గొనిపోకున్న మరణమే శరణ్యము.

శ్రీరా—జానకీ! అట్లయిన నీసిరుల దానధర్మములఁ జేసి ప్రయాణమునకు సంసిద్ధురాలవై యుండుము. లక్ష్మణుఁడు ఏమిచేయునో తోడ్కొని వచ్చెదను. తండ్రిగారిని దర్శించి వనములకుఁ బోవుదము.

సీత—మహాప్రసాదము.

నాటకురంజి రాగము—రూపకము.

ప॥ హాయిగలిగె నీఁక ప్రియా నామదికిపుడు।

అ॥ ప॥ పాయఁజాల నిన్ను నాథ - పాదపద్మములు గొలుచు
చుందునే॥ హా॥

కాంతకు జీవమైనగానీ। కాంతకు దైవమైనగానీ
కాంతుఁడే ప్రియకాంతుఁడే
సతికిఁ బతియె గతియు నామనోహరా॥హా॥
[సీతారాములు చెరియొక వైపునకు నిష్క్రమింతురు.]

## 2 వ రంగము.

(లక్ష్మణుఁడు ప్రవేశము)

మోహనరాగము—చాపుతాళము.

లక్ష్మ—ప॥ కఠారధారన్ శతురాలి న్నే-కంఠలుంఠనము గావింతున్

అ॥ప॥ కుఠారధరుం డడ్డంబైనన్ - జఠరము జీల్తున్ ప్రేగుల్ దాల్తున్॥కఠా॥

చ॥ రాజగునా - భరతుఁడు రాజగునా - రాముఁడు ముని యగునా

విధాత విధి యగునా - విధి కేను వెఱచెదనా

ఆసింహాసనమున మారఘురాముని భీముని నే నుంతున్

కైక యెవతె భరతుఁ డెవఁడు. ॥కఠా॥

శ్రీ జానకీరమణుఁ డడవుల కేగవలయునా ? కైకా! పిశాచీ నీపుత్రుఁడు రాజ్య మేలునా? ఏల? ప్రథమపుత్రుఁడౌ శ్రీరామచంద్రమూర్తి రాజ్యార్హుఁడుగాని, వరములఁ గోరుటకుఁ గైకకును, దానముచేయుటకుఁ దండ్రికిని, స్వీకరించుటకు భరతునకును నెట్టి హక్కు గలదు? సత్యవాక్పరిపాలన మఁట. పంచభూతములసాక్షిగా తన యంతరాత్మసాక్షిగా "సుకుమారా! శ్రీరామా! రేపే నీపట్టాభిషేక మని తండ్రి తననోటనే నుడువలేదా? వసిష్ఠాదులు లేరా? అదితప్పిన సత్యవిరుద్ధము కాదా? కుట్ర! కుట్ర!! నారాముఁడు, నాప్రాణము, నాసర్వస్వ మని కుటిలపుత్రప్రేమఁ గురిపించి, తన వలపులరాణిమోహపాశబద్ధుఁడై, భరతునికిఁ బట్టాభిషేకముఁ జేయనెంచి బహిరంగముగా జరుపుట కీలక్ష్మణహార్యక్షమునకు జంకి, వరముల మిషఁ గల్పించి నేఁడు తా నొకపుత్రవాత్సల్యసౌశీల్యునివలె నటించి కటికినేలపైఁ బడి పొర్లాడ నేర్చిన కుటిలనికటతటీశయుం డగు తండ్రి యొకతండ్రియే? వృద్ధజంబుకంబే కదా! అట్టివాని దొక యాజ్ఞయా? తీర్ప

కున్న పాపమా? అట్టిపాపమందుఁ డొకతండ్రియైనను గురుండై నను దైవమైనను దండించినను, ఖండించినను, తగులఁబెట్టినను పాప మంటనేరదు. కళ్యాణగుణగణశోభాయమానుండ వైన రామా! మంగళలక్షణలక్షితశ్యామాభిరామా! అవక్రపరాక్రమక్రమభీష్మా! నా వేదము, ధర్మము, దైవము, ప్రాణము నైన పరంధామా! ఈలక్ష్మణుని కంఠనాళములందు రక్తము ప్రవహించుచుండఁగనే యయోధ్యలో నీకుఁ బట్టెడన్నమును, గ్రుక్కెఁడు నీళ్ళను, జేనెఁడుభూమియుఁ గఱవయ్యెనా? నీవు! నారచీరలఁ దాల్చి "తండ్రీ! సెలవా? తల్లీ! పోదునా? సఖీ! దుఃఖింపకుమా!" యనుచు, తమ్ముఁడా! యనునపు డట్టుడికినట్లుడుకు నాహృదయతాపము భరింపఁ గలనా? భరింపఁ జాల! భరింపఁజాల నాకన్నుల నీఖడ్గమునఁ బొడుచుకొనియెదనే కాని భరింపఁజాల. కైకాపిశాచమునకై కౌసల్యా తపస్విని గర్భశోకమంద నేల? కైకరక్త మిదే నాకరవాలమునకుఁ బూతలిడెద. జనకుం డడ్డమైన ఖండించెద. భరతుం డెదిర్చిన తుండెతుండెంబులు గావించెద. దైవ మేతెంచిన మత్తగజము నంకుశమున మరల్చినట్లే మరల్చెద. దైవప్రతికూల్యవిఘ్నితమైన శ్రీరామపట్టాభిషేక మిదే ఖడ్గమాత్రద్వితీయుండనై నేనే నిర్వర్తించెద. అయోధ్యఁ బీనుఁగుపెంటల గుంట గావించెద. యముఁడు నన్ను సజీవముగా బడబాగ్నిజ్వాలలఁ బ్రోల్చినను సరియే కనకసింహాసనము శ్రీరాముఁ డధిష్ఠింపవలయును. భరతునిఁ జూడఁజాల, చూడఁజాల. రామా! సుగుణధామా! నీపైఁగల భక్తియే నాకాధారము. (పోఁబోవును.)

(శ్రీరాముఁడు ఆతురతతోఁ బ్రవేశించి)

శ్రీరా—లక్ష్మణా! లక్ష్మణా! ఏమిది?

లక్ష్మ—దేవా! నన్ను దీవించి పంపుము.

శ్రీరా—ఎందులకు?

లక్ష్మ—శత్రువులను జించిచెండాడుటకు.

శ్రీరా—ఎవరి శత్రులు?

లక్ష్మ—నీ శత్రులు నా శత్రులు?

శ్రీరా—అయోధ్యలో మనకు శత్రులు గూడఁ గలరా?

లక్ష్మ—ఇంతవర కట్టి మాయలోనే యుంటిమి.

శ్రీరా—నేఁడు?

లక్ష్మ—నేఁడు తేటతెల్లము కాలేదా? నీపైఁ గుట్రఁ బన్నిన దుష్ట త్రయము శత్రులు గారా?

శ్రీరా—ఎవ రా దుష్టత్రయము?

లక్ష్మ—కైక - దశరథుఁడు - భరతుఁడు.

శ్రీరా—తల్లి - తండ్రి - తమ్ముఁడునా?

లక్ష్మ—ఇంకేటి బాంధవ్యము? నిన్నుగ్రాటవుల కంపనెంచిన పాప కార్యావలంబకులు బంధువులా?

శ్రీరా—(నవ్వి) తమ్ముఁడా! నీ వెంత వెఱ్ఱివాఁడవు! క్రోధమే ప్రధానమా?

చ॥ సతతవిషాద సంభరితసంకులలంపటరాజ్యభోగమా
యతులిత ధాళధళ్య విభవోజ్జ్వల సూనృత దివ్యభోగ సం
తతులకుఁ జాల దెన్నఁడును దమ్ముఁడ! సత్యము నిత్యధర్మమౌఁ
బితరునియాజ్ఞ యాజ్ఞయగుఁ బేదను జేసిన రాజ్య మిచ్చినన్.

లక్ష్మ—సోదరా!

ఉ॥ సత్యము సత్యమో యనుచు శాంతము వీడవు వీరసింహమా!
సత్యముగాదె నిండుసభ "సర్వమహీంతల మేలుమో సుతా!
నిత్యము"టన్న తండ్రినుడి, నేఁ డది తప్పుట సత్యమానె? యీ
కృత్య మదేమి న్యాయమొకొ? గీటునఁబుచ్చిన నేమిదోషమో?

శ్రీరా—మనతండ్రి మున్నే దేవాసురయుద్ధసమయమున మన పినతల్లికి వరద్వయముఁ బ్రసాదించి యుండలేదా? ఆ వరము లను ముందుగాఁ దీర్పుబాధ్యత మన తండ్రిపైన లేదా?

లక్ష్మ—అయినను రాజ్యార్హుఁడౌ జ్యేష్ఠుని సామ్రాజ్యచ్యుతునిఁ గా నొనర్చి యడవికిఁ బంపుటకుఁ దండ్రి కెట్టిహక్కు గలదు ?

శ్రీరా—'రామా! రాజ్య మేలు' మనుటకు హక్కుగల తండ్రికి 'రామా! యడవుల కేగు'మనుటకు హక్కు లేదా? రాజ్య మిచ్చిన స్వీకరించుతనయుఁడు అడవుల కేగుమనినఁ బోవ వలదా ?

లక్ష్మ—సోదరా! కైక తనపుత్రునకు రాజ్యముఁ గోరుకొనినను నిన్నడవులపాలుసేయ వరమడుగుట న్యాయమా? ధర్మమా? భరతునిసమ్మతియే లేకున్న కైక యిట్లు కోరఁగలదా? కుట్ర! కుట్ర!!

శ్రీరా—కైక నిమిత్తమాత్రమేగదా. తమ్ముఁడా! కష్టములు మాన వునకుఁగాక మ్రానునకు వచ్చునా? ఈశ్వరచిద్విలాసమేకదా!

సీ॥ అస్థిపంజరముపై నభిమాన మదియేల ?
సత్యమార్గమునకు స్వస్తియేల ?
ప్రాణవాయువులకై పరితపింపఁగనేల ?
మోహవారాశిని మునుఁగనేల ?
భాగ్యభోగములకై ప్రాకులాడఁగనేల ?
వరమునీశుల సేవ వదలనేల ?
దైవచింతనలేని తర్కవాదములేల ?
మదచిత్తతన్ వృథా వదరనేల ?

గీ॥ పెంచి, పెద్దవారలఁ జేసి, ప్రేమఁజూపి,
గంపె డాసతో నుండెడి కన్నతండ్రి
ఋణముఁ దీర్పక పుత్రులు గోణుగనేల?
పుట్టగతు లెందును లేక పోవనేల?

తమ్ముఁడా! కావున నీకోపము మ్రింగుము. పౌరుషమున కిది సమయము కాదు.

లక్ష్మ—సోదరా!

మ॥ ఇలలోఁ దండ్రులు పుత్రుల న్గదిసి తా మెంతేని సంప్రీతిచేఁ
'గలవా రూకలు? తెత్తునా ఫలములం? గాంక్షింతువా దుస్తులం'
చలక ల్దిద్దుచుఁ బల్కరింతురుగదా, హా తండ్రి మోహాంధుఁడై
పలుకున్ 'గానల కేగు రాఃప' యని; యీ పాంసుండనున్
దండ్రియే.

శ్రీరా—తమ్ముఁడా!

మ॥ కుడువంబోవక తండ్రి జీవకళల న్గోల్పోయి కన్మూసి పు
ట్టెఁడుదుఃఖంబున మున్గి నేలఁబడి యెల్లెల్లో సజీవుండుగా
నడువం గాళ్ళివి రావు నా కకట యన్యాయంబుగాఁ దండ్రి ని
య్యెడ దూషించి కఠోరముల్ వలుక నోరెట్లాడెనో తమ్ముడా!

ఇట్టికఠోరవాక్కులఁబలికినందులకుఁ బశ్చాత్తాపమందుము. పితృవాక్పరిపాలనమే నాకుంగర్తవ్యము. స్థిరసంకల్పుఁడను సోదరు లందఱు న న్విడనాడినను నావిధికృత్య మిదియే. నీకు నాయందు లవమేని భక్తియుండెనేని మారు పలుకకుము. పలికిన నాపై నాన.

లక్ష్మ—హా! సోదరా! స్త్రీయందలి వాత్సల్యముచే నట్లంటినిగాని భవదాజ్ఞాశృంఖలాబద్ధుండనే గదా?

శ్రీరా—లక్ష్మణా! నీవింక నాకు మారుగా నింటనుండి తండ్రికి దుఃఖోపశమనముఁ జేయుచుండుము.

లక్ష్మ—దేవా! నీవెంట నేతెంచుటకు నా కనుజ్ఞ నీయవా?

శ్రీరా—తమ్ముఁడా! సీతయు న న్ననుసరించుచున్నది. నీవును వచ్చిన దుఃఖతప్తులౌ మనతలిదండ్రుల కేది వెఱవు?

లక్ష్మ—హా! సోదరా! సీతారాములు లేనియయోధ్యలో నా కేమి పని? నే నొకక్షణ ముండఁగలనా? నన్నుఁ గొనిపోకున్న నా శిరము ఖండించి పొమ్ము. (మెడ వంచును)

శ్రీరా—(లక్ష్మణుని కౌఁగిలించి) తమ్ముఁడా! నీ వింటనున్నఁ దలిదండ్రులకు దుఃఖోపశమన మగునని యట్లంటిని గాని నీవు

న న్విడనాడి నిలువఁజాల వని నే నెఱుంగనా ? అట్లే రావచ్చును. నీ వేగి నీ జననియనుమతినిఁ గొని రమ్మి. తండ్రిఁ జేరి సెలవంది పోవుదము. నేనును బ్రయాణ సన్నద్ధుండనై యుండెద. శీఘ్రమున రమ్మి.

లక్ష్మ—మహాప్రసాదము.

(శ్రీరాముఁడు నిష్క్రమించును.)

లక్ష్మ—[ఏకాంతమున.]

కటకటా, ఎట్టి శాంతస్వభావున కెట్టి యిక్కట్టులు సంభవించెను! ఇట్టి పూజ్యుని పాదసేవ వీడి నే నిందు నిలువఁగలనా? ఓ రాజ్యలక్ష్మి! రాముని వరింపవైతివా ?

సీ॥ ఉయ్యేలతొట్టెలో నూఁగిననాఁడైన
శ్రీరాముతోడ నిద్రించినాను
గోరుముద్దలగుజ్జుసారంబుఁ దినువేళ
శ్రీరాము చెంతనే చేరినాను
అక్షరంబుల దిద్దు శిక్ష గాంచకమున్నె
రామనామమె నేర్చి పలికినాను
శస్త్రాస్త్రవిద్యల సద్గురూత్తమునిఁగా
శ్రీరామభద్రునే కోరినాను

గీ॥ రఘుకులాన్వయరాజవిరాజమాన
ధీరసద్గుణాశ్రయదేవదేవుఁడైన
రామచంద్రునితోడిదే బ్రతుకు నాకు;
రాజు భరతుఁడే కానిమ్మి రాజ్యలక్ష్మి.!

(నిష్క్రమణము.)

## 3 వ రం గ ము.

(కైక మందిరము)

దశ—ప్రియసీ శ్రీరాముఁడే తెంచి 'తండ్రీ! సెలవా' యనకమునుపే నీ వీవరముల వీడితి నని కర్ణామృతముగాఁ బలుకవా? పలుకవా? వామాక్షీ!

కైక—(విసరుకొనుచు) మీ కింకను నాశాలత తెగదా?

దశ—నీహృదయ మెంత కఠోరమే!

(శ్రీ సీతారామలక్ష్మణులు ప్రవేశింతురు.)

దశ—(శ్రీరాముని జూచి) హా! జగన్మోహనాకారా! ఎంత ఘోర మెంత ఘోరము!

శా॥ రామా! రమ్మిటు రమ్మటంచుఁ గడుగారాబంబున న్నీరు, నా
సామిం బొమ్మికపొమ్మటంచు నిపు డేచందానఁ బోఁద్రోలుదున్
సౌమిత్రీ! దయ నేల పూనితివి న న్నంపీతి ఖండింపుమా
వామాక్షీ! జనకాత్మజా! కరుణ శాపంబొందు నా కీయుమా.

శ్రీరా—తండ్రీ! ధీరచిత్తులగు మీరే యిట్లు దుఃఖింప నబలలౌ మాజనను లెంతదుఃఖింతురో యూహింపరా? మాపినతల్లి కైక యుండే యుండెనుగదా, ఆమె భరింపఁగలదా?

లక్ష్మ—(తనలో) కైక యనినంతనే యేలొకో నాయొడలు భగ్గున మండుచున్నది.

దశ—రామా! ఎంత యమాయకుఁడవు. ఇంకను పినతల్లియా?

లక్ష్మ—తండ్రీ! అట్టికౄరాత్మురాలివలలోఁ దగుల్కొని యెంత చింతించిన నేమి ప్రయోజనము?

దశ—లక్ష్మణా! నిజమే పలికితివి?

కైక—నాథా! శ్రీరామలక్ష్మణులకుఁ గల చిత్తస్థైర్యము మీకు లేకుండెనే?

దశ—బ్రహ్మరాక్షసీ! నీ వెక్కడి పత్నివి!

(వసిష్ఠుఁడు, సిద్ధార్థుఁడు, ప్రవేశము)

దశ—గురువర్యా! వందనములు. ఈఘోరదృశ్యమును గాంచ నేతెంచితిరా? సిద్ధార్థా! ఇట్టిపాపాత్మునికొలువుకూటము విసర్జించి ధీమంతుల సేవించుటయే నీ కుచితము గదా.

వసి—రాజా! కాలకర్మకృతమైన ఘోరమునకు నీ వేమి చేయఁ గలవు?

సిద్ధా—రాజా! మీరే పరితపించిన నీబాలకుమారుల గుండెలు పగులవా?

శ్రీరా—తండ్రీ! సత్యమే ధర్మము, సత్యమే దైవము, సత్యమే సర్వస్వమని నీవు నాకెంత బోధించితివి. అసత్యవాక్పాలనాపరీక్షయే కదా యిది. అదియును గాక,

మ॥ తరమే ధాతకు వానితాతకును హా తప్పింపఁ గర్మార్థముల్,
స్థిరమే యీమనరాజ్యవైభవము లాసింపంగ నో తండ్రీ! కా
పురమిట్లుండునె ఖేదమెల్లపు డయో భూమీశ యూహింపుమా
నగనీజాక్షకటాక్షవీక్షణమునన్ సంతోషమున్ రాదొకో?

దశ—హా! కుమారా! నీవంటిగుణరత్నాకరుఁడు నాకు దక్కునా?

సీ॥ ఏనాఁటికానాఁడె యెట్లుంటివో తండ్రి
యని పల్కరించువా రెవరు రామ!
ఏఁడి నాసుతుఁ డని యేడ్చెడి కౌసల్య
నెట్లూరడింతు నే నింక రామ!
ఎన్నాళ్లు జీవింతు నిట్టి దుఃఖంబుతోఁ
బితృతర్పణముఁ జేసి వెడలు రామ!
ఏతండ్రి తనపుత్రు నిట్లుకానలఁ ద్రోసె
నే నొకండనుగాక యిలను రామ!

గీ॥ ఏనగంబులఁ జేరుదు నెందుబోదు?
నెట్టు లేమూల డాగుదు నింక రామ!
ఎవరి వేడుదు? నేగతి, యేది వెఱవు?
ఎవరు దిక్కు నీ వేగ నా కిందు రామ!

శ్రీరా—తండ్రీ!

సీ॥ చెక్కిలి ముద్దాడి మక్కువతో నన్నుఁ
బెంచిన మోహంబు విడువు మిపుడు

సతియైన సుతుఁడైన సర్వసంపదలైన
సత్యంబుతోఁ బోల్ప సాటియగునె
భరతుఁడే రాముఁడై ప్రణమిల్లు భక్తితోఁ
బరితపింపకు మింత బాలుఁ డతఁడు
పరమేశ్వరునికృప వనవాసమును దీర్చి
రాజ్య మేలుట కేను రానె మరల?
గీ॥ ఎంతలోఁ గడచుఁ బదునాల్గేండ్లు తండ్రి!
ఎంతలో నీకుఁ గూర్చెద సంతసంబు
నీదునాజ్ఞ నేలినఁగదా నీకు సుతుఁడ
నీకుఁ గీర్తి కల్గినఁగదా నాకు ముక్తి.

తండ్రీ! నే నెందేగుచుంటిని? తాత్కాలికారణ్యవాసము నకేగదా. రాజ్య మెవరి కిచ్చితిమి? మన భరతునకే గదా. జనకా! దుఃఖింప నేల? మా ముగ్వురకును సెలవిడి పంపుఁడు.

దశ—కుమారా! నీ వంటి సచ్ఛీలుని నిలుప నా తరమా? సిద్ధార్థా గజహాయస్యందనాది చతురంగబలంబుల రామున కూతగాఁ బంపుము.

కమాస్‌రాగము - ఆదితాళము.

కైక—సాహసమా యింత సాహసమా, పరిహాసమా-
రాచరికము గనినన్ ॥సా॥
బావుట మాయది, బలములు మాయవి
పంపుట కింకిట మీ పెత్తనమా॥ సా॥
ఆశాపాశమునందు జిక్కువడి మీ రీ వేసము సేయుదురా
ఆహా! లేశం బొక లేశంబైనన్ గన హక్కు మీకు లేదు
మీ రెఱుఁగరా ॥సా॥

సిద్ధా—దేవేరీ! భరతునకుఁ బట్టముఁ గట్టవలయు ననియే కోరితివిగాని రామునితో చతురంగములు బంపరాదని, కోరలేదే! నీవదాని మూఁడవవరముగా ముందే కోరకపోతివా? నీ వట్టి యజ్ఞానము

న కిప్పు డేమిచేయగలవు? రథంబుల నీయకున్నమానె సైనికులు మీావేతనంబులకు స్వస్తిఁజెప్పి స్వబుద్ధితో శ్రీరాముని వెన్నంటి పోవనున్న నీ కాతంకపరచుట కెట్టిహక్కు గలదు? వ్యక్తిస్వాతంత్ర్యమును భంగించు చట్టము లేవియుఁ బ్రజానురంజకుఁడగు దశరథమహారాజురాజ్యంబున లేవే? నీవు భరతుని పట్టాభిషిక్తునిఁ గావించినపిమ్మట నీ వట్టిచట్టముల నిర్మింపఁజేసి యిట్టి యాతంకములఁ గల్పింతువుగాని లెమ్ము. ఇపు డట్లు చేయఁజాలవు?

లక్ష్మ—ఓ దుర్మతీ! పినతల్లివైన నయ్యెదవుగాక. నీ వెవర విటి యాతంకముఁ గల్పించుటకు?

సీ॥ వటపత్రశాయియై వారిజాక్షుఁడు మున్ను
దాల్చిన పూర్ణస్వాతంత్ర్యశక్తి
బ్రహ్మాండభాండంబు బ్రహ్మ కల్పించుచోఁ
దాఁ గొన్న యట్టిస్వాతంత్ర్యశక్తి
ప్రాణులఁ గల్పించి ప్రాణికోటికి ధాత
స్థాపించునట్టి స్వాతంత్ర్యశక్తి
అక్షరరాశియై యక్షరాక్షరమున
స్తవనీయమైన స్వాతంత్ర్యశక్తి
గీ॥ తన్వి! యట్టి యావ్యక్తిస్వాతంత్ర్యశక్తి
కెట్టి తేఁడైన పుస్తెనుఁ గట్టఁగలఁడె
కట్టిన నాప్రజ్వరమకును గట్టునేమొ!
తరమె నీకుఁ దరిక్కింప స్వాతంత్ర్యశక్తి.

శ్రీరా—తమ్ముఁడా! నీ వించుక శాంతించుము. తల్లీ! నేఁది యె ట్లున్నను వనవాసము సలుపఁబోవు నాకుఁ జతురంగబలము లతో నేమిపని? నానారచీరల నా కనుగ్రహింపుము.

కైక—నాయనా! శ్రీరామా! నీజ్ఞాన మిం కెవరికిని లేదుగదా. (లోనికిఁబోయి మరల ప్రవేశించి) ఇవే నారచీరలు; చక్కఁగా ధరింపుము.

(నారచీరల నిచ్చును. రాముఁడు స్వీకరించును.)

శ్రీరామా! యీలక్ష్మణునకును జ్ఞానోదయముఁ గావింపుము. (లక్ష్మణునిఁ జూచి) లక్ష్మణా! నీసోదరుఁడు గ్రహించినట్లే నీవును గ్రహింపుము. ఇవే నీ నారచీరలు.

(ఈయఁ బోవ లక్ష్మణుఁడు త్రోసివైచును.)

లక్ష్మ—ఓపాపాత్మురాలా! నీ పెత్తన మిం కెవరిపై సాగింతువు? భరతునివంటి యనాథలపైనను, జనకునివంటి వృద్ధులపైనను, శ్రీరామునివంటి బాధ దేవులపైనను సాగింపుము. పౌరుషప్రధానుఁ డగు నీ లక్ష్మణునిపై నీయాటలు సాగవు. నా నారచీరలు నా కేకలవు. నీ నారచీరలను నీవే ధరింపుము. లేకున్న నీ కొమరుని ధరింపఁజేయుము. కాదేని వ్రేలాడు వృక్షశాఖల కంటఁగట్టి నీ కంఠంబున కురిఁబోసికొనుము. నీ చేతఁగాదేని నన్నుఁ బ్రార్థింపుము. నే సాయపడెదను.

కైక—లక్ష్మణా! ఈబింకముల కేమిలే! శ్రీరామునికంటె నీ యాధిక్య మేమి? కొను మీనారచీరలను.

లక్ష్మ—ఓ దుర్మతీ. నా యాధిక్య మేమియా?

ఉ॥ పట్టితి ఖడ్గ మియ్యదియె ఫల్లునఁ ద్రుంచెద నీశిరంబు, ని
ప్పట్టునఁ బిల్చెదో భరతుఁ, బ్రార్థనఁజేసెదొ ప్రాణవల్లభున్;
నెట్టన నీదురక్తమున నే నభిషేకముఁ జేసి దుర్మతీ!
పట్టముఁగట్టువాఁడ నిదె భ్రాతకు రామున కిప్పు డిప్పుడే.

(ఖడ్గముతోఁ బోఁబోవును)

వశి—(అడ్డగించి లక్ష్మణుని చెంత మోకరించి)

మ॥ తనయా! ధన్యుఁడనౌదు నన్ను మరా; ధర్మాత్మునిన్ ధీరునిన్
గుణరత్నాకరు శ్యామలాంగధరు సత్కోదండవిభ్రాట్టు నీ
యినవంశోత్తము రామభద్రునిఁ గటా! యేనొక్క క్రూరుండనై
వెనుదీయంగద కాన కంపుటకు. నీవే దిక్కు దీనావనా!

శ్రీరా— కీర్తన.

మోహనరాగము - ఆదితాళము.

తండ్రిశిరము ఖండింతునో దాసోహంబని వేడెదో హా హా తండ్రి॥
గోండ్రించుచు బెబ్బులివలె క్రోధోన్మాదుండవగుచు
తండ్రియనక తల్లియనక తీండ్రము నీగతినిఁ జూపి
తండ్రీ యని పిలువఁగలవ తమ్ముఁడ నని పిలువ గలవ ॥తండ్రి॥

తమ్ముఁడా! యిప్పుడైనను మనతండ్రిసౌశీల్య మెఱిఁగితివా? ఖండింతునా? శరణందువా?

లక్ష్మ—(శాంతించి తండ్రికి నమస్కరించి) తండ్రీ! క్రోధోన్మాదుండనై యేమేమో ప్రేలితిని. నన్ను క్షమింపవా, తండ్రీ!

దశ—కుమారా! లక్ష్మణా! నీవే ధన్యుఁడవు. లెమ్ము నాయనా!

సీత—దేవీ! నానారచీరలను నాకుఁ బ్రసాదింపుము.

కైక—సీతా! నీవు రామునకుఁ దగిన పత్నివే! ఇవే నీ నారచీరలు.

(సీత యందుకొనును.)

(సీతారామ లక్ష్మణులు నిష్క్రమింతురు.)

వసి—ఓ పాపీ! నీ దౌష్ట్యమున కంతులేదా? శ్రీరాము నరణ్యములపాలు జేయువరము మాత్రమే కోరితివిగాని సీతపై నీ కెట్టి హక్కుగలదు? పరమశాంతస్వభావుఁడగు శ్రీరాముని సౌశీల్యము గ్రహింపలేక నీ సర్వనాశనము నీ వెఱుంగలేక నీ విం డొక తోకచుక్కవై యుంటివి. ఈ యయోధ్యలోని మానవ పశుపక్ష్యాది సమస్త జీవరాసులును శ్రీ రాముని వెన్నంటియే పోవును. నీ వీ పాపభూమి నేలుకొనుము. భరతుఁడు నీ పుత్రుఁడనియే తలంచితివి కాని శ్రీరామభక్తాగ్రేసరుఁడని గ్రహింపఁగల జ్ఞానము నీకు లేదయ్యె. నీ కొమరుఁడు నిన్నొక విషసర్పముగా గ్రహించి ని న్విసర్జించి శ్రీరామచంద్ర చరణారవింద సేవాభిలాషుఁడై జటావల్కల ధారియై తన యన్నను గొల్చునేగాని నీ దుష్కర్మ నామో

దింపఁడు సుమా. అపుడు నీవు విషము గ్రోలెదవో, యబ్ధి దూకెదవో, మఱే మొనర్తువో యెవరి కెఱుక?

కైక—గురువర్యా! మీరును శ్రీరామపక్షపాతు లేనా?

దశ—గుణోత్తమా!

మ॥ తొలిజన్మంబున నెట్టి ఘోరదురితోద్యుక్తుండనై యుంటినో
కలిగె న్నాకు సతీపిశాచ మిపుడీ కైకేయి మానీంద్ర! దు
ష్ఫలితం బీగతి నేచుచుండ నిఁక దుష్పాండిత్యమేగాక ని
ష్ఫలమే కాదొకో కైకయందిపుడు సత్పాండిత్యమాశించుటల్.

కైక—శ్రీరామునకు దాసోహ మ్మని రాజ్య మర్పించి భరతునకు గాజులు దొడిగించి శుద్ధాంత కాంతాజనంబులమధ్యఁ గూర్చుండఁబెట్టిన నాది సత్పాండిత్య మని పెద్దలు నిర్ధారణఁ జేయుదురు కాఁబోలు. నాథా! భరతుఁడు రామునివంటి ధీరుఁడు గాఁడా? సచ్ఛీలుఁడు గాఁడా? నాకే కుమారుఁడా? నీకుఁ గాఁడా?

దశ—ఆ భరతుఁడే యింకున్న నీ యాటలు సాగునా?

గీ॥ భరతుఁ డీరామభక్తితత్పరుఁడు కలికి!
యెఱిఁగి కోరితే వరముల? నెఱుఁగ కేమొ!
తరుణి! రానిమ్ము నీ బిడ్డ తరలి యిటకు
భరతుఁ డంగీకరించినఁ బంపు మపుడు.

కైక—నాథా! అవి యేటిమాటలు? నాకును నా పుత్రునకును గల్లోలములను గల్పింప యత్నించుచుంటిరా? నే నంత తెలివిమాలినదానను గానే, వేచియుండుటకు? ఎవరిలాభ మెవరు మానుకొందురు. ఇంతకును నా వరముల ననుసరించియే కోరితిని గాని మంత్రింగ మేమియుఁ జేయలేదే? ఆ వరములుచితముగా నీయుటలేదే? మీ ప్రాణములను మున్ను కాపాడితిని. అందులకుఁ బ్రతిఫలముగా నీ స్వల్పవరముల నీయఁజాలరా! లేకున్న నీయ ననరాదా? నే బాధింపనే.

దశ—ఎంత చదువు చదివితివే! ఓ పాపీ! నిన్ను వేడినను పాషాణమును వేడినను నొకటియే.

[నారచీరల ధరించి సీతారామలక్ష్మణులు ప్రవేశింతురు.]

దశ—

మాయామాళవ గౌళరాగము - ఆదితాళము.

ప॥ అంపపుకోతయెరా రామా - మది-కంపర మందుదురా రామ ॥అం॥

అ॥ ప॥ తెంపులేని యీపుత్రశోకానల మది నను దహియించున్ చంపిపోరాదా నాకుమారా! చావే రాదేమో ॥అం॥

శా॥ పన్నీట జ్జలకంబులాడి ఘనమా వస్త్రంబుల న్దాల్పఁగా
నెన్నెన్నో సురటుల్ విలాసపుసుఖం బీయంగ సౌఖ్యోన్నతిన్
విన్నాణంబునఁ దేలు రాముఁ డిపు డీవేషంబుఁ దాల్పంగ, నా
కన్ను ల్గాంచియు చిల్లులైన పడ వీకన్దోయి నా కేటికో?

హా! విధీ! నాముద్దుకుమారుని సకల సామ్రాజ్యాభిషిక్తునిగా నొనర్ప నే నెంచియుండ సీతారామలక్ష్మణు లిట్టి మునివేషంబులఁ దాల్చునట్లు నాచేతఁ జేయించితివా? గాధినందనా! నీప్రియశిష్యున కీదుస్థితిఁ గల్పించినకైకాపిశాచమునకొక ప్రత్యేకనరకము సృజింపరాదా? మున్నుత్రిశంకునకు ప్రత్యేకస్వర్గము సృజింపలేదా? నాపైఁ గరుణ రాదా? ఓరక్కసీ! కైకా! నీకడుపుమంట తీరినదా? నీకన్నులు చల్లబడినవా? ఇంతటితోనైన నను నీపట్టు విడువరాదా? గోముఖవ్యాఘ్రమా! నీకుఁ గరుణ యెక్కడిది. వజ్రనిర్మితహృదయవు కదా. రామా! నన్ను క్షమింపవా?

శ్రీరా—తండ్రీ!

ఉ॥ చిత్తముఁ జక్రిపై నునిచి, చింతల నన్నిటిఁ బాఱఁద్రోలి యే
మొత్తిడి లేక, శాంతులయి యుండెడి దివ్యతపఃప్రభావులౌ

నుత్తమమౌనిపుంగవుల కొప్పెడు నయ్యవి నారచీరలే
యిత్తఱి చింత యేటికి? మునీశునిఁ జేయుట ముక్తి నిచ్చుటే.

భరతుఁడే నేనని తలఁచి దుఃఖమును మ్రింగుము. సర్వ మహీతలాధిపతివైన నీ కీవిచారము తగదు. ఇట్టి కష్టసముద్రముల నీజీవయాత్రయం దెన్ని దాటితివి? దుఃఖము మ్రింగి మాకు సెలవిడి పంపుము. జనకా! నీ విట్లున్న మాకుఁ గాళ్లాడునా?

దశ—శ్రీరామభక్తాగ్రేసరా! లక్ష్మణా! కుమారా! నీకైనను నాపై దయరాదా? క్రోధమూర్తివైన న న్నేల ఖండింపవు?

లక్ష్మ—తండ్రీ! తనయుల నిట్లు వేడుట తగునా?

దశ—తల్లీ! జనకపుత్రీ! నీ కీ దుస్థితిఁ గల్పించిన దుర్మార్గుఁడను. నీవైనను నన్ను శాపదగ్ధునిఁ జేయవా?

సీత—పితృసమానులౌ మీ రిట్లనఁ బాడియే. మమ్ము దీవించి పంపుఁడు.

దశ—సీతారామలక్ష్మణులలో నొకరికైనను నాపై దయరాదు గదా.

శ్రీరా—తండ్రీ! యెంత చింతించినను ఫల మేమియును లేదుగదా. మీ రింత దుఃఖించిన నాతల్లి గుండెలు వ్రీలి మరణింపదా?

కైక—శ్రీరామా! ఇట్టి యేడ్పులతోనే పదునాల్గేండ్లిందే గడపివై చెదనా?

దశ—హా! పాపీ! వేరుపురుగా!

లక్ష్మ—ఓ క్రూరాత్మురాలా! ఆ శ్రీరాముఁ డిందుండఁబట్టియే నీ జీవములు నిల్చిన వని గుర్తెఱుంగవా?

శ్రీరా—తల్లీ! కనన్మాతకాల మోర్వ్వ మమ్మా. భరతునిమాత్ర మడిగితి వని తెలుపుమమ్మా.

కైక—రామా! భరతుని నే మడుగుదువు? రాజ్య మడుగుదువా?

శ్రీరా—తండ్రీ! కైకమ్మ సహింపకున్నది. దుఃఖము మ్రింగి దీవించి పంపుము. నా తల్లి నెట్లు కాపాడుదువోగదా. తండ్రీ!

ఉ॥ తల్లికి నేకపుత్రుఁడను, తల్లియు శోకవిదగ్ధ ముగ్ధయుం
బెల్లగు దుఃఖసంభరిత వృద్ధతపస్విని మాయ నేర్వదే
యెల్లిద మోర్వలేదుగద, యెన్నడు న న్విడియుండలేదు, హా
తల్లి నదెట్లు బ్రోచెదవొ తండ్రి! వనంబుల కేను బోయెదన్.

దశ—హా! కుమారా! న న్నెవరి కప్పగించితివి?

సీ॥ రారమ్ము శ్రీరామ! భ్రాంతితో వీక్షించి
కన్నులఁ గోల్పోదు కడకు రామ!
రారమ్ము సుకుమార! భ్రమఁదీరఁగాఁ బల్కి
బధిరుండనై పోదు తుదకు రామ!
రారమ్ము గుణధామ! నోరారఁ బిల్చితి.
నేమౌనొ యవల నో రింక రామ!
రారమ్ము నాతండ్రి! నేర మెంచక నేడు
నారచీరల నిచ్చినాన రామ!
గీ॥ పుత్ర! కరములు కట్టులై పోకమునుపె
బుడుత! జిహ్వపైఁ దడి యారిపోకమునుపె
తనయ! మతి చంచలత్వంబుఁ గనకమునుపె
రమ్ము కడసారి కౌఁగిలి నిమ్ము రామ!

(శ్రీరామునిఁ గౌఁగిలించి) తండ్రీ! పంచభూతములును, నష్టదిక్పాలకును, త్రిమూర్తులును ని న్నెల్లప్పుడును గాపాడుచుందురుగాక! నీ సత్యసంధత్వము ని న్నెల్లపుడు కాపాడుఁగాక! పదునాల్గేండ్లు వనవాసదీక్షం దీర్చి సతీసోదరయుతుండవై సుఖివై యయోధ్యఁ జేరి సింహాసనాధిష్ఠితుండవై యాచంద్రతారార్కముఁ గీర్తిఁ గాంచెదవుగాక.

సీ॥ నీ పూతచరితంబు నిర్మలకావ్యమై
రామాయణంబుగాఁ గ్రాలుఁగాక

నీ పాదపద్మము ల్నిలిచినతలములు
పుణ్యతీర్థంబులై పొసఁగుఁగాక
నీరామనామంబు నిస్తులగేయమై
తారకమంత్రమై తనరుఁగాక
నీదివ్యమూర్తియు దేదీప్యమానమై
భజనమందిరముల వఱలుఁగాక

గీ॥ రామభక్తు లీధారుణిఁ బ్రబలియుండి
రామనామామృతానందరసముఁ గ్రోలి
రామకోటిని వ్రాయుచు రాణనలర
రత్నగర్భను మ్రోయుత రామభజన.

గీ॥ ధరణిఁ బితృభక్తిపరుఁడన్న తనయుఁ డన్న
రాముఁడే రాముఁడే యను రక్తిమీఱ
నిఖిలజగముల నీ కీర్తి నిండుఁగాక
పోయి రావయ్య, సుకుమార! పోయిరమ్ము.

కుమారా! లక్ష్మణా! నీరామభక్తియే నీ కలంకారం బగుఁగాక. పరమపతివ్రతాశిరోమణీ! శ్రీరామపత్నీ! నీ పాతివ్రత్యమే నిన్నుఁ గాపాడుఁగాక. మీ రెల్లరు నా నేరముల క్షమించి వనవాసదీక్షఁ దీర్చి యయోధ్యలో సుఖులై ప్రవేశించెదరు గాక. పోయిరండు. (నేలపైఁ జతికిలఁ బడి) హా! భరింపఁజాల భరింపఁజాల.

హిందూస్థానిముఖారిరాగము - చాపుతాళము.

దశ—ప॥ హా! నేఁడే తుద చూపగునేమో - హాటకగర్భుం డెటులు లిఖించెనో ॥హా॥

శ్రీరా—అనయము నావదనవీక్షణమె - యాహారంబగు నీకో తండ్రీ! వనికిఁబోవ నేఁ బదునాల్గేండ్లును - బ్రాణముల నీ వెటుల భరింతువో ॥హా॥

లక్ష్మ—రఘుకులచంద్రుండగు రామునితో - రాజ్యవిదూరుఁడనై నేఁ జనియెద

అఘము లున్న నను క్షమియింపు మనఘ - హా! యిఁకనైనం గైకను నమ్మకు ॥హా॥

దశ—పుత్రా! ని న్నెన్నఁడింకఁ జూతు రాఘవా!

ఓ జానకీ! లక్ష్మణా! అరుగుచుంటిరా?
పుత్రులకై కలువరించి పుత్రకామేష్టిఁ జేసి
పుత్రులన్ మిమ్ముఁ గనియు - శత్రుఁడనై పోతినిరా
కృత్రిమమునఁ గైకచేసె - పుత్రా! నే నెటుఁగ నేమి ॥హా॥

దశ : రామ : లక్ష్మ—హా నేఁడే..............................

(దశరథుఁడు మూర్ఛిల్లును, శ్రీసీతారామలక్ష్మణులు నిష్క్రమింతురు.)

[తెరపడును.]

ఇది తృతీయాంకము.



# రామపాదుకలు

## చతుర్థాంకము.

### 1 వ రంగము.



(పౌరులు శ్రీరాముని వెంబడించుచు)

జంఝూటిరాగము - అటతాళము.

ఏమయ్యా రామయ్యా - యెల్తున్నావా వనికి
మాంగతేం జెప్పావో - మాపాలిదేవర ॥ఏమ॥

పట్టాభిచేకమంటె - పడ్డాము బలె చరదా
పట్టిందా పెద్దదయ్యం - పాపిట్టి కైకకు ॥ఏమ॥

ఎంటా యెల్తున్నావా - ఏమయ్య లచుమయ్యా
కుంటోళ్లం అయిపోయాం - కూకోబడ్డాం చామి ॥ఏమ॥

అల్లిందీ కైకమ్మ - అంతా పీకుల్లాటా
తల్లిచిదరగొయ్యా - పెల్లి చేతముండో ॥ఏమ॥

వద్దొద్దా చీతమ్మా - వద్దొద్దు ఎల్లొద్దు
ముద్దాపెట్టాలేమా - ముద్దుల మాతల్లి ॥ఏమ॥

మాంగుడిసెల్ వొగ్గేత్తాం - బాగోగుల్ మాకొద్దు
బేగీ రావయ్యో - బెమ్మాండా రామయ్య ॥ఏమ॥

## 2 వ ర ం గ ము.

[సీతారాములు శయనించియుందురు.]

(లక్ష్మణుఁడు ఖడ్గహస్తుఁడై కావలాగాయుచుండును.)

లక్ష్మ—

సీ॥ రాజాధిరాజుగా రంజిల్లుటకు మాఱు
శ్రీరాముఁ డడవులఁ జేరవలసె
బంగారుగద్దెపై భాసిల్లుటకు మాఱు
రాలగుట్టలపైనఁ గూలవలసెఁ
బట్టుతల్పములపైఁ బవళించుటకు మాఱు
కలఁతనిద్రను నేలఁ గాంచవలసె
భటవర్గముల సేవఁ బడయుఁడు సరిగదా
దండ వీవన లేక యుండవలసె

గీ॥ దుఃఖమొదవినం గన్నీరు దుడుచుటకును
గన్నతల్లికి దూరమై యున్నవాఁడు
అన్నియుండియు లేకుండ నున్నవాఁడు
సత్యమూర్తియగు శ్రీరామచంద్రమూర్తి.

మ॥ కలఁడా కైకకుఁ బుత్రుఁ డింట, మఱియా కళ్యాణి మామాతకుం
గలఁ డొక్కండు సుతుండు చెంగటను, హా! కౌసల్య కేఁడీ సుతుం
డలదుఃఖంబును రూపుమాపఁగఁ; గటా యాసాధ్వి నేడ్పింపఁగా
జలజాతాత్మకసంభవుండు దలఁపక జాల్మొండె యై పోయెఁగా.

(వినుట నభినయించి) ఓకుక్కుటములారా! కూయుచుంటిరా! మీకును లోకువయా? సీతారాముల ప్రస్తుతావస్థఁ గాంచి వెక్కిరించుచుంటిరా?...ఓ కటికచీకటీ! రక్కసీ! మీ రేమి చేయఁగలరనియా యికిలించుచుంటివి? కాకున్న నింతవఱకు కాటుకఁ బ్రామినటులు కారునలుపుగా నున్న నీ కిపుడు తెలుపు వర్ణమెక్కడిది? (వినుచు) ఈ నిర్జరప్రదేశమునం దేదో శబ్ద ముత్పన్న మగుచున్నదే?......"ఓరోరీ భరతా! మమ్మా

యుగ్రాటవుల కంపినది చాలక కైక నీతో కొండెములు జెప్పి పంపఁగా. మమ్ము వధించుటకు సైన్యసమేతుఁడవై యేతెంచు చుంటివా? ఈ లక్ష్మణహర్యక్షము కాచుచుండ శ్రీరాముని కాల్గోటినైనఁ దాక నీతరమా? కండకావరమా? ఇదే వచ్చితి. చచ్చితి వనుకొనుము. (ఆకస్మికముగా నాగి) ఏమీ! ఎంత భ్రమించితిని. కోళ్ళు కూయుటకును, చీకటి నలుపు తగ్గుట కును, జంతుసంతానములు కదలుటకును, తెల్లవారుటయే కదా కారణము. (తెరవైపుఁ జూచి) అయ్యో! సోదరుఁడు కదలు చున్నాఁడే నిద్రాభంగమా? ఓ పాడువిధీ! మా రామునకు సుకుమారశ్యామునకుఁ బలభీమునకుఁ బట్టాభిషేకభంగమే కాక నిద్రాభంగముఁగూడ కలుఁగఁజేయుచుంటివా!

(సీతారాములు మేల్కాంతురు.)

[సీతారాములు ప్రవేశము.]

శ్రీరా—(ప్రవేశించి) లక్ష్మణా! నీవు నిద్రింపనే లేదా?

లక్ష్మ—సోదరా! నాకెట్లు నిద్రవచ్చును. హంసతూలికాతల్పం గతకోమలశ్యామలాంగుఁడ వగు నీ వీకటికినేలపై శయనింప నాకు నిద్రయా? ఈ పదునాల్గేండ్లును నిద్రాహారవిసర్జన క్రియాలోలుండనై కాలముఁ గడుప ప్రతిదీక్షాబద్ధకంక ణుండను గదా సోదరా!

శ్రీరా—(లక్ష్మణుఁ జేరఁదీసి) సోదరుఁడ వన నీవేకదా లక్ష్మణా!

(గుహుఁడు ప్రవేశించి దూరముననుండి)

గుహు—(తనలో) ఎవరా పిల్లకాయలు? యేలుపులా? దొరబిడ్డలా? చమాచారం తెల్సుకోవాల. (కొంతదూరము ముందునకు నడచి) ఆఁ! సీతారాములోరు కాఁబోలు. ఓ దొరో! అవును. అదుగో! లచ్చుమయ్య చామి. అదుగో! సీతామ్మోరు. అమ్మ తల్లో. (శీఘ్రముగా నడిచి శ్రీరాముని సమీపించి సాష్టాంగ పడి) చామీ చాట్టాంగాలు, దేవరా! (శ్రీరాముఁడు లేవఁదీ

యును) సీరామా! రామరామా! ఈ కట్టుబట్టలేంటి? ఏనుగులతో లొట్టిపిట్టలతో నిత్తెబోగాలతో మహైశ్వర్యంగా ననోన్నడవు నీవు ఆలి నెంట బెట్టుకొని, తమ్ముణ్ణి తోడెట్టుకొని కాలినడక నొచ్చావే? అయ్యో, నీకేమి శికొచ్చింది?

గీ॥ ఓడు నిన్నెల్లగొట్టె ని నోడు దిట్టె
చింగమని నిన్ను సూడక సేరె నోడు
సచ్చు పెద్దమ్మ యాడేడొ? సరిగ సెప్పు
సెట్టు కంటగట్టుదు నాణ్ణె యొట్టు సామి.

శ్రీరా—మిత్రమా! నీ వాత్సల్య మపారము. ఇది అస్మదీయపితృాజ్ఞ.

గుహు—దొరా! అదేంటి.

శ్రీరా—నేను పదునాల్గేం డ్లరణ్యవాసము సలుపవలయు ననియు నాతమ్ముఁడౌ భరతుఁడు పట్టాభిషిక్తుఁడు గావలయు ననియు నా పినతల్లి కైక నాతండ్రిని వరద్వయముఁ గోరెను. ఆవరముల నేను దీర్ప నెంచితిని.

గుహు—ఇ య్యేటివొరాలు? కైకమ్మ కీ వొరా లేడడానికి గుండికాయ లున్నాయా?

శ్రీరా—కారణాంతరము.

గుహు—ఈ గోరపడవిలో నీవు తిరుగాడ్డం కైకమ్మ కిట్టమా?

శ్రీరా—కర్మలిఖితము.

గుహు—నిమ్మళత్తుఁడవు. దమ్మరాజువు. నీకే యిల్లాంటి పింతల్లి దాపరిత్తే బూలోకంలో పజలకు సైతమ్మలపోటు సెప్ప తరమా?

శ్రీరా—ప్రాప్తాప్రాప్తము.

గుహు—అదేంటయ్యా పవురుచంముం దియ్యనీ లొక్కే నవ్వారుకో, కైకమ్మను బరతయ్యను నెడ్డేసి నిన్ను గద్దెక్కింతాను.

నీ దయ నా మీ దుండాలిగాని, నా చామిరంగా పాలాచ్చు డొచ్చిన నీ పట్టాభిషేకం చాగించనూ? నీ కొలువుసేసి తరిత్తాను. సామీ నాకు చెలవియ్యాల.

లక్ష్మ—నే నీ మహామహుని యాజ్ఞాశృంఖలమున బంధింపఁబడకున్న పట్టాభిషేక మీ సరికి నే నే చేసియుందునుగదా, మిత్రమా!

శ్రీరా—మిత్రమా! నీవట్టికార్యముఁ దలపెట్టిన నాకు ద్రోహమే కాని సంతోషము కాజాలదు. నీ వాకార్యమునుండి విముఖుండవైతి వని పలికిననే మిత్రవాత్సల్యము. పలుకకున్న నాపైనాన. పలుకుదువా? లేదా?

గుహు—అయ్యో! రామా! నిన్ను యేచమునఁ జూడలేకన్నానుగాని నీమాట నాకు యేదవాక్కు కాదా?

శ్రీరా—అట్లయిన గంగోత్తరణమునకై నావ సిద్ధపఱుపుము.

గుహు—సిత్తము. ఇటు దయసెయ్యాల.

(సీతారామలక్ష్మణులఁ దోడ్కొని గుహుఁడు నిష్క్రమించును.)

(తెరపడును.)

---

(తెర యెత్తఁబడును.)

(గంగయొడ్డు.) (అందఱును నమస్కరింతురు.)

శ్రీరా—ఓ గంగాభవానీ!

సీ॥ విష్ణుపాదాంబుజావిర్భూతమహిమచే
ముల్లోకముల్ ఖ్యాతి ముంచినావు
బ్రాహ్మణాబ్రాహ్మణ భావవిద్వేషముల్
నీలోన దిగమ్రింగి నిలిచినావు
కలుషహీనక్రియాకలిత వౌచు విపుల
భరతభూమినిఁ బేరుఁ బడసినావు
వైకుంఠకైలాసవైభవంబుల నెల్ల
సమకూర్పఁగా నీవె చాలినావు

గీ॥ కల్పవల్లికిఁ దుల్యవై కడఁగినావు
కామధేనువుఁ బోలంగఁ గలిగినావు
తల్లులకుఁ దల్లివౌచు రాజిల్లినావు
తల్లి! భాగీరథీ! నీకు దండమమ్మ.

శ్రీరా—మిత్రమా? ఇఁక నావ నధిరోహింతము.

గుహు—సామీ!

గీ॥ ఎంతటోడివో, రాయి కా లెట్టఁగానె
ఆడయైసంబు దాలిసె, నయ్యో! నావ
యేమగునో కాళ్లు గడగాలె సామి! దువ్వ
దుడిసి, గంగాబవానిని గడపఁబువ!

శ్రీరా—(నవ్వుచు) అట్లే కానిమ్ము:

(గుహుఁడు కాళ్లుగడిగి, శిరస్సున జల్లుకొనును)

(అందఱు నావ నధిరోహింతురు)

---

(గంగయావలియొడ్డు)

లక్ష్మ—(ప్రవేశించి) (ఏకాంతము)

జింగలారాగము.

కాలచక్ర మాపతరమ కమలభవునికైన హా ॥కాల॥

కేల నాపఁజాల రెవరు - గిఱ్ఱుగిఱ్ఱునం దిరుగు ॥కాల॥

ఏలుగా భరతుఁ డింక - ఎసక మెసఁగ రాజ్యరమను
బాలభానుఁడైన రామ - భద్రుఁ డడవిపాలుగాఁగ ॥కాల॥

మధుర మధురభాషణుండు - మృదులమృదుల భావణుండు
ప్రథితయశుఁడు ప్రాణసముఁడు - రక్షకుండు రాముఁడహా
॥కాల॥

[నిష్క్రమించును.]

సీత—(ప్రవేశము) (ఆయాసపడుచు చతికిలఁబడి)

ఉ॥ ఎంతకష్టమైన మది నెంతటిచింతలు గూడియున్ననుం
జెంతను బ్రాణవల్లభుఁడు చెల్వుగనుండిన సంతసంబగున్
గాంతుఁడె మోక్షదాయకుఁడు కాంతకుఁ గాంతుఁడె దైవమానుర
వ్వంతయుఁ గోర సౌఖ్యములఁ బాయఁగఁ గోరను నామనోహరున్.

(సొక్కుచు, సోలుచు, నిష్క్రమించును.

(శ్రీరాముని ప్రవేశము.)

సీ॥ తాళహింతాళాది తరుషండమండితం
బంధకారాంతరబంధురంబు
తలలు విరియఁబోసి దయ్యాఁబులట్టులే
మున్ముందు బెదరించు ముండ్లపొదలు
బండలపై మాంసఖండంబుల న్జేర్చి
ముక్కులం బొడుచు రాపులుఁ గుగములు
అల సిపాయీల బారులవలె కరిసింహ
శరభశార్దూలముల్ బరుగులెత్తు
గీ॥ రండు రండు దాహమునకు రం డటంచుఁ
జేయి సూపుచు సంజ్ఞలఁ జేసినటులె
యెండమావులు మెఱయు నీరెండలందుఁ
గట్ట! ప్రియుసిం దిప్పుదు నిట్టి యడవి.

చ॥ నడువఁగఁ గాళ్లు రాక, జఘనంబునఁ బాణినిఁ జేర్చి, చెమ్మటల్
దుడుచుచుఁ జీరకొంగున నె, తూలుచు నూర్పునిగుడ్చుచు న్గటా
పడుచును లేచుచు న్మరలఁ బాదము లొత్తుక ధీరచిత్తయై
నడుచు సతీమణి న్గనియు, నానయనంబులఁ గోలుపోవఁగా.

ఇది చతుర్థాంకము.



శ్రీరస్తు.

# రామపాదుకలు.

## పంచమాంకము.

### 1 వ రంగము.

[అయోధ్యాపురిలో భరతశత్రుఘ్నుల ప్రవేశము.]

భర—

కళ్యాణిరాగము - చాపుతాళము.

శ్రీరామా నీదయ నాకుఁగలద - శ్రీగుణాభిరామా ॥శ్రీ॥
పడయదు కాంతిని భాస్కరబింబము - భావము దోప దేమి
మూఢనో ॥శ్రీ॥
కోపము నాపై - కోదండధరా కోరుభక్తుఁడను నేను గాన
నీపాదాంబుజ నిర్మలాత్ముఁడను - నిఖిలము నీవని నిరతము
దలఁతును ॥శ్రీ॥
ఎపుడు రాజవై యెపుడీరాజ్యము-నేలుదు వీవిఁక యినకులతిలకా
ఎప్పుడికెప్పుడు కృపాసహిత కృపారసము నపారముగఁ
తమ్ముఁడా! జల్లు ॥శ్రీ॥

సీ॥ అంబా యనుచు నార్పు నావుదూడల విప్పి
పాలకై విడిచెడివారె లేరు
తలక్రిందులై పోయి మెలఁగొన్న జెండాల
సవరించువారలే యెవరు లేరు
పెంటపోగులు నిండె పురవీథు లన్నిటఁ
గసవు నూడ్చెడివారె కానరారు

బేరసారములచే మారుమ్రోగుచు నుండి
వరలు సంగళ్ళనే తెఱువ రోకరుఁ
గీ॥ గ్రిక్కిరిసియుండవలసిన చక్కి యిదియు
నేమొ జనశూన్యమై పోయె హేతు వేమొ
అెక్క లల్లార్చు పక్షి యేయొక్కటైన
అెప అెపన్ గొట్టుకొన దిట్టిరీతి యేమొ!
తమ్ముఁడా! శత్రుఘ్నా!, ఏ కీడుమూడెనో కదా. పరశు
రాముఁడు మరల దండెత్తియే వచ్చెనో, యింత యాలసించి
నందులకు శ్రీరామునకు మనపైఁ గోపమే వచ్చెనో కదా.
శత్రు—అన్నా! ఏదో కీడు మూడెననియే నాకును దోఁచుచున్నది.
ఉ॥ మిత్రులు శత్రులే యయిరొ, మేటిమగం డొకఁ డూరలేనిచోఁ
శత్రులు దాకఁగాఁ బరవశత్వముఁ గాంచెనొ రాజ్యలక్ష్మి, యీ
ధాత్రిని రామసింహమును దాకెడి ధీరుఁ డదెవ్వఁడౌనో యే
మాత్రముదోప దేమియును మార్గ మగమ్యమునుమ్మిసోదరా!
భర—తమ్ముఁడా! సమస్తభారమును నీశ్వరునిపై వైచి ప్రార్థింతము.
భర: శత్రు—

జింగలారాగము - చాపుతాళము.

ఈశా పరమేశా జగదీశా
సజ్జనపోష సన్నుతవేష యీశ యీశ యీశ లోకేశ॥ ఈ॥
ఎప్పటి కెట్టుగ నెవ్వరి కేమో
తప్పదు తప్పదు సర్వేశా
ముప్పాల కెల్లను తెప్పవునీవే
తెప్పవు నీవే పార్వతినాథా! ॥ఈ
భర—తమ్ముఁడా! నీవు మాతను దర్శించి రమ్ము. నేను నామాతకుఁ
బ్రణమిల్లి వచ్చెద.
శత్రు—అనుజా! అట్లే పోయివచ్చెద.

(భరతశత్రుఘ్నులు నిష్క్రమింతురు)

[ తెరపడును. ]

## 2 వ రంగము.

[ కైక గృహాంగణము ]

కైక—(ఏకాంతము) నాపతిమరణావస్థయందు నాకుమారుని పట్టాభిషేకకార్యదీక్షయే శరణ్యమై యున్నదికదా. దూరాలోచనగల మంథర తనభావమంత్రములచే నాకు మహోపకారమే యొనర్చెను. లేకున్న నీసరికి నేను కౌసల్యాదాసినై యూడిగముఁ జేయుచుండవలసియే యుండెడిదికదా. కౌసల్యయే నాదాసి గావలసియున్నది. సెబాస్! మంథరా! దాసివైనను బ్రజ్ఞాధుర్యవు; మంత్రివై సదా నాయండ నుండుము. చుక్కానివై యీ కైకయను నావను నడుపుచుండుము. (ఆలోచించి)

ఇంతకును నాపుత్రరత్న మిందుల కంగీకరించునో లేదో కదా ఏల యంగీకరింపఁడు? కఱకుకరవాలంబున ఖండింతునన్న శిరం బొగ్గనివా రుందురుకాని సామ్రాజ్యాభిషేకంబున కంగీకరింపనివా రుందురా? (ఆలోచించి) భ్రాతృవత్సలుఁడు గదా? భరతుఁడు. మాతృభక్తిపరాయణుఁడు మాత్రముగాదా. నాముద్దులకుమారుఁడు నామాట జవదాఁటనే దాఁటఁడు. దాఁటిన మరణమే శరణ్యము; నాపతి ననుసరించి పతివ్రత నయ్యెద. అయిన దయిపోయినది. కానున్నదికదా కర్తవ్యాంశము. కానిమ్ము.

(భరతుని ప్రవేశము.)

భర—తల్లీ! యిదే నమస్కరించుచున్నాను.

కైక—కుమారా! వాంఛాఫలసిద్ధిరస్తు. తనయా! నీవులేని నిమిషమొక యుగముగా గడపితిని సుమా!

భర—తల్లీ! పుత్రవాత్సల్య మెందుబోవును.

కైక—నాయనా! మీమేనమామ సుఖయే?

భర—తల్లీ! క్షేమముగనే యున్నాఁడు. మన మందిరమున నందఱు సుఖులేకదా,

కైక—మరచితిని. నీతమ్ముఁడు శత్రుఘ్నుఁడేఁడి కుమారా!
భర—తనమాతను దర్శింప నేగినాఁడు. తండ్రియేఁడమ్మా?
కైక—మార్గాయాసమున నీమోము బడలినది సుకుమారా!
భర—నామాట కేమిగాని తండ్రి యేఁడమ్మా!
కైక—అంతయును సావకాశముగాఁ దెలిపెదను. నీవు బడలికఁదీర విశ్రమింపుము.
భర—ఇపుడు సావకాశముగాదా. తెలుపుట కంతయున్న విశ్రమింపనేల?
కైక—మంచియానందసమయములో నీతండ్రి నీకులేఁడుగదా స్వర్గస్థుఁ డయ్యెనుగదా.
భర—ఆఁ! ఆఁ! నా తండ్రి నాకులేఁడా. హా దైవమా!

ఉ॥ రాముని రాజుఁ జేయుదురొ రా జొకయాగముసేయనానొ రా
మామణి జానకీరమణి మంజులరీతిని బిడ్డనెత్తెనో
యేమునివర్యుఁ డీపురికి నింపుగఁ జేరెనొ యేమొకో యటం
చీమదిఁ బొంగియుంటి నిపు డీగతి ముంచితివేల దుర్విధీ!

సీ॥ తండ్రి తండ్రీ నీదు తనయుఁడం బిలుతును
పలుకవా? పలుకవా? పలుకు తండ్రి
ఎన్నాళ్లు గడచెనో యేనేగి కన్నెత్తి
చూడవా? చూడవా? చూడు తండ్రి
మనసాయెఁ గౌఁగిలి మరుగేల? హస్తముల్
చాపవా? చాపవా? చాపు తండ్రి
ప్రియమార భాషింప వేడుకయ్యెను నాకు
వినవుగా? వినవుగా? వినుము తండ్రి
గీ॥ మాతులగృహంబునకు నన్నుఁ బ్రీతిఁబంపి
విష్ణుపాదంబులను జేర వెడలినావ?
మరలి వచ్చితి నీవును మరలి రావ?
రావ! రావ! రావా! నేనె రాన తండ్రి!

కైక—ఎంత దుఃఖించిన నేమి ఫలము ? విచారింపకుము! నాయనా! పోయినవారితో మనము పోఁగలమా.

భర—తల్లీ ! భరింపఁజాల! భరింపఁజాల! మరణావస్థయందు నాతండ్రి నాపైఁ బ్రాణము లుంచుకొని భరతా ! భరతా! యని యెంత విలపించెనో కదా. నాతండ్రి తుదివాక్కు లేవి జననీ ?

కైక—నీ తండ్రి తుదివాక్కులా ? చెప్పుమనియెదవా ?

భర—అవియును వినఁదగనా ?

కైక—సీతారామలక్ష్మణులు మగుడ నేతెంచినపుడు కనులారఁ గాంచువారి కన్నులే కన్నులు. వారి జన్మమే ధన్య మని.

భర—ఏమి ? మా తండ్రితుదినిముసములలో సీతారామలక్ష్మణులు చెంతలేరా ?

కైక—లేరు.

భర—హా ! తండ్రీ ! భవచ్చరణారవింద సేవాభిలాషుల మగు మా నల్వ రన్నదమ్ములలో నొక్కరికైనను నిన్ను క్రిందఁ బెట్టుటకైనను భాగ్యము లేకపోయెనా ? అయ్యో తల్లీ ! సీతా రామలక్ష్మణు లేల లేకపోయిరమ్మా ?

కైక—నీ తండ్రియే పంపెను. నే నే మెఱుఁగుదును?

భర—ఎక్కడకు ?

కైక—వనములకు.

భర—ఎందులకు ?

కైక—నివసించుటకు.

భర—నివసించుటకా ? వనములకా ? తండ్రి పంపెనా ?

కైక—అవును, నివసించుటకే. వనములకే. తండ్రియే పంపెను.

భర—నమ్మఁజాల, నమ్మఁజాల. పరిహాసమున కిది సమయమా జననీ ?

కైక—నిజమాడిన పరిహాసమా, తనయా?

భర—ఏమీ! నిజమా? మాజనకునిమరణము నీకు మతిచాంచల్య
ము కలిగించెనేమో కదా.

కైక—లేదు, లేదు. స్థిరచిత్తనయియే యుంటిని.

భర—మాతండ్రి యిట్టిఘోరకార్య మేకారణాంతరమున సలిపెనో
కదా?

కైక—నిన్ను రాజుఁ జేయనెంచి.

భర—ఛీ! శ్రీరామున కర్హమౌ రాజ్యాభిషేకము నాకా?

కైక—నీక్షేమాభివృద్ధినిఁ గోరువా రట్లు నీతండ్రినిఁ గోరిరి.

భర—ఎవ రాగాఢమిత్రులు?

కైక—ఇం కెవరు, నీతల్లినైన నేనే.

భర—ఛీ! ఛీ! నాతల్లివైన నిట్లు కోరుదువా? నీవు కోరినను తండ్రి
యె ట్లంగీకరించె?

కైక—కుమారా! మున్ను దేవాసురయుద్ధములో నీతండ్రిప్రాణము
లను రక్షించినందులకు నాకు రెండువరముల నిచ్చెను. ఆవర
ముల నే నిపుడు కోరితిని. నీవు సకలసామ్రాజ్యాభిషిక్తుఁడవై
రాజ్య మేలుచుండఁ జల్లగా నాకన్నులఁ గాంచవలయు నని,
యొకవరమున నీకుఁ బట్టాభిషేకమును; రెండవవరమున నం
దుల కభ్యంతరముగానున్న శ్రీరామునకుఁ బదునాల్గేం డ్లరణ్యా
వాసమును గోరితిని. నీతండ్రి మనకు రెండువరముల నీయవలసి
యుండుటచే మనవలలోఁ జిక్కినాఁడు, కనుక నే నీకీరాజ్యప్రాప్తి.

భర—ఛీ! చండాలీ!

హిందూస్థాని ముఖారి - ఆదితాళము.

ప॥ తండ్రిఁజంపినావా మాశ్రీరాముని కానల కంపితివా
అ॥ ప॥ బిడ్డాయని మాకౌసల్యాంబయు గుడ్డ నీ రెంత గుక్కు
చున్న దో ॥తండ్రి॥

# శ్రీ రా మ పా దు క లు.

చ॥ కలనైనను నేఁగలువరించితినె - కావలె నాకీరాజ్యఁబని గయ్యా
ళీ! నీ పుట్టేమి మున్గెనని మాపుట్టి ముంచితివి నట్టేటన్
కులుకనెంచితివె బ్రహ్మరాక్షసీ - కుల్లి చావు మేనొల్లను
రాజ్యము
ఇల నిఁకే నక్కలైన నంటవిఁక నీకళేబరము ఛీ! దుర్మతీ!

కైక—కౌసల్యాదాసిగా నేనును, రామభటుఁడవుగా నీవును జీవితాంతమువఱకును కుళ్లి నీరుగారుట కన్న నిది మేలుగదా? కుమారా! యేటి కీతొందర. పతివిహీననౌ నాకేటి కీసంపదలు. నీకై కదా కష్టించి యార్జించితిని. బాల్యవయస్కుఁడ వౌటచే ననుభవజ్ఞానము లేక పలికితివి. నేఁ గోపగించుకొనను లెమ్ము. తాత్కాలికోద్రేకములలో మగ్నుఁడవుగాక భవిష్యత్ఫల మాశించుము. శ్రీరామునకు లక్ష్మణునిపైఁగల వాత్సల్యము నీపైన లేదుసుమా! నీకేటి కీభ్రాతృవాత్సల్యము? రాముఁడు నీవంటిమానవుఁడే కదా! నీకేటి కాభక్తి? జననీజనకు లెల్లకాల ముట్టిఁగట్టుకొని యూగులాడుచుందురా? దూర మాలోచించుకొనుము రాముఁడే రాజ్యాధిపతియైన భ్రాతృప్రేమ నిలుచునా? కల్ల, కల్ల. శ్రీశివవిష్ణులకే పోరాటము సంభవించెననుపురాణ గాథలు వినలేదా? ఇంతకును నవమాసములు మోసి కని పెంచిన తల్లిమాటల నేల వలదని యీరాముఁడైనను జెప్పునా? అట్లేయయిన రాముఁడేల యరణ్యములకుఁ బోవును? తనయా! నామాటల నాలింపుము. లెమ్ము, రాజ్య మేలుకొమ్ము.

భర—ఓ బ్రహ్మరాక్షసీ! నీనాల్క వేయిచీల్కలుగాఁ దఱిఁగివైచెద. హా! రామా! వలదనియా నాయంతరాత్మకు బోధించుచుంటివి?

చ॥ జనకుని జంపినా వకట; జానకి, రాముని, లక్ష్మణోత్తమున్
వనముల కంపినావుగద; పాతకి! నీ విఁక నన్ను జంపవే!
దునుముదుఁగాని తున్కలుగ దుర్మతి ని న్నిట ఖడ్గధారచే
వినయగుణాలవాల తత వేద్యుఁడు పూజ్యుఁడు రాముఁ డోర్వఁడే!

కైక—కుమారా! మాతృభక్తిని మించు భక్తి కలదా?

భర—ఓ కాళీ! నీ వింకెక్కడి తల్లివి?

సీ॥ పతిప్రాణములఁ దీసి బంగారుగద్దెపైఁ
గులుకుచుంటివదేట్టికుమతి వీవు
కరములు ముకుళించి కరము నిన్గొల్చు శ్రీ
రాము నెట్లంపి తరణ్యములకు
నీవంటి దేకాదె నీ వెట్లు సీతకు
నారచీరలఁ గట్టి నడపినావు
రామునిఁ బోఁదోలి రాజ్య మేలు మనెదె
చండాలి! నీ వెట్టిజనని వింక
గీ॥ రాముఁడే తండ్రి, రాముఁడే రక్షకుండు,
రాముఁడే తల్లి, రాముఁడే ప్రాణమైన,
రామభటుఁడనై రాముని రాజుఁ జేతుఁ
గడకు శిక్ష నీ కయ్యెదే కాళరాత్రి!

కైక—కుమారా! నేను తప్పే చేసితి ననుకొనుము. రావలసిననింద రానే వచ్చినది. నీవును నన్నుఁ జిన్నఁబుచ్చిన నా కేటికీ బ్రతుకు?

భర—ఓకూళా! నీవు బ్రిదుకవలయు నని యేడ్చుచున్న వా రెవరు?

శా॥ కారే జ్యేష్ఠులు రాజు లీధరణిలోఁ? గారేమి పుట్టింట? ని
న్నారాధించి తపంబుఁ జేసితినె యీరాజ్యంబుకై యేడ్చు చే
నోరా నీదగుపుట్టి మున్గినదె; దుర్వ్యాపారచండాలి! నీ
యూరా? పేర? యయోధ్య నీకు చెడుగా! యూకొట్టువా రెవ్వరే?

కైక—అనాథను గదా.

భర—నాతండ్రిని నీ వాక తుచ్ఛురాలవై, మోసగించి, యసువు లపహరించి, యనాథవైతి; ననుభవింపుము.

కైక—వైధవ్యమునకుఁ దోడు గర్భశోకముఁ గూడనా?

భర—పరమపతివ్రతాశిరోమణియైన కౌసల్యామాతకు గర్భశోకముఁ గూర్చిన నీకు గర్భశోకము కలుగ దనుకొంటివా?

కైక—ఎంత చతురతతో శ్రీరాము నరణ్యములకుఁ బంపితిని? వృథా వృథయా?

భర—ఓపాపినీ! నీచతురత యేమి? పిత్రాజ్ఞాబద్ధకంకణబిరుదాంకితుఁడైన శ్రీరామచంద్రమూర్తి శాంతమూర్తి యాటచేఁ బంపఁగలిగితివి?

కైక—నే నార్జించినరాజ్యముఁ దృణప్రాయముగాఁ జూడఁదలంతువేని నన్ను ఖండింపుము!

భర—లక్ష్మణాహార్యతమము నావలెనే శ్రీరామాజ్ఞాబద్ధమై యుండకున్న మున్నే నీశిరంబు తాళఫలంబుభాతిఁ దెగిపడియుండెడిది.

కైక—కుమారా!

భర—ఛీ! కుమారా యనిన నీనాల్కఁ జీల్చెద.

కైక—తల్లీ! యనవా?

భర—భర్తృఘాతినీ! పుత్రఘాతినీ! నిన్ను తల్లీయని పిలిచిన కలుషంబు లంటును. ఆ భువనైకమోహనుని, నా సత్యవాక్యులుని నా యవతారమూర్తిని, మా శ్రీరామచంద్రుని నా చేతులఁ దెచ్చి నీ కన్నులయెదుటనే—పాపినీ!—నీ కన్నులయెదుటనే ధరణీసామ్రాజ్యధారేయునిఁగా నొనర్చి నిన్నే వనవాసమున కంపెద. కాదేని ధన్యమూర్తి యగులక్ష్మణునివలెనే శ్రీరామచంద్రచరణారవింద సేవానందతన్మయుండనై వనంబులనే కాలముఁ గడపెద. ఛీ! నీ విఁక నాయెదుట లెమ్ము. (దిగ్గున లేచి) ఛీ! ఛీ! నీ వదనమండలము వీక్షించిన ఘోర నరకమే సంప్రాప్తించును.

(మంథరను దఱుముచు శత్రుఘ్నుఁడు ప్రవేశించును.)

శత్రు—

ఉ॥ దండము దండమన్న నిఁకఁ దప్పదు ఖడ్గముఁ జేతఁబూనితిన్
కండలఁ జెండి కూళ! నడిఁ గాకుల గద్దలపాలుఁ జేతు; ఛీ!

కొండెము లెన్నో చెప్పి యిటు కొంపను గూల్చితి వీవు చండి! నీ వుండవు; కాను రాముఁడ; బలోద్భటలక్ష్మణసోదరుండనే!

మంథ—(భరతునిపదములపైఁబడి) భరతరాజేంద్రా! శరణు, శరణు.

భర—(శత్రుఘ్నునిఁ జేరఁదీసి) తమ్ముఁడా! శాంతింపుము; శాంతింపుము. స్త్రీహత్య మహాపాతకము.

శత్రు—సోదరా! ఇంకను బాపపుణ్యములా? మనకొంపఁ దీసిన దిదియే కైకను బురిఁగొల్పి మనక సంకటము గల్పించినది.

భర—నామాత జ్ఞానవంతురాలైన దాసి చేయున దేమి?

శత్రు—కైకయే నాతల్లియైన నీసరికి యమపురికిఁ బంపకుందునా?

భర—తమ్ముఁడా! నాకును నట్టిభావమే కలదు గాని మనగురుఁడును, ధర్మమును, వేదమును, నైన శ్రీరాముఁ డిట్టిచేతల సహింపఁడు సుమా. శ్రీరామునికై వీరిని క్షమింపవలసియున్నది.

శత్రు—అదియు నిజమే. అందులకే నాసోదరుఁడు లక్ష్మణుఁడు వీరిని విడిచిపోయెను.

మంథ—ఏమమ్మా! కైకమ్మా! నన్నునీసుతుల కప్పగించి వినోదముఁ గాంచుచుంటివా? ఎట్లును మీరును మీరును నొకటియే.

కైక—నీవే కదా కారకురాలవు? ఎవరికర్మ మెవ రనుభవింతురు?

మంథ—రాజులతోసహవాసము పాములతోఁజెలగాట లన్నట్లున్నది.

శత్రు—ఓ తుచ్ఛురాలా! ఇంకను బ్రేలుచుంటివా? "శ్రీరామా! శరణు, శరణు" అనుము, లేకున్నఁ జచ్చితి వనుకొనుము.

మంథ—ఆఁ! ఆఁ! శ్రీరామా! శరణు, శరణు.

శత్రు—(కాలితోఁ దన్ని) క్షమించితిని. పొమ్ము దుర్మతీ!

భర—తమ్ముఁడా! గురువసిష్ఠులను గలిసి తండ్రిగారిదహనకర్మలను నిర్వర్తించినతదుపరి శ్రీరామునిఁ గొనిరా వనముల కేగవలయును. రమ్ము.

శత్రు—అన్నా! అట్లే.

[భరతశత్రుఘ్నులు నిష్క్రమింతురు.]

[తెరపడును.]

## 3 వ రంగము.

(పురవీథులయందు భరతుఁడు ప్రవేశించును.)

బేహాగ్ రాగము - చాపుతాళము.

భర—ప॥ ఎపుడో! రామా! నీ దర్శనంబో తారకనామా! ॥ఎపు॥

చ॥ కృపఁగని రావా నన్నిటఁ గావా కేశవుఁడవు నీవే
మధుర మధుర సుధానంద రసాసాంద్రా!
మృదులాతిమృదుల సత్పాదారవిందా!
విదితసింహపరాక్రమ భుజాసౌష్ఠవరాట్చంద్రా
సదయహృదయ యెఱుఁగ నే నెఱుఁగ జననిచేతలన్
వెదకి తుచ్ఛవరము లడిగి తుద కిట్టులు జేసెనుగా
నదురు బెదురు లేక మాత ॥ఎపు॥

రామా! నీ నామాక్షరద్వయ మెంత మధురసుధారసమును జిప్పిలుచున్నది! రామా! జగదేకవీరుండవయ్యు, నిఖిలజనశాసనుండవయ్యుఁ దుద కొక్కవనితచే వంచింపఁబడితివా? రామా! నన్నేల విడనాడితివి? కైక గర్భవాసమునందు జన్మించితి నని నాపైఁ గోపమా? స్వయంకృతాపరాధము గాదుగదా? విధివిధానమేగదా? సుకుమారవనితయౌ మా తల్లి జానకి నారచీరలఁ దాల్చినప్పుడైనను నీకుఁ గోపము రాలేదా? శాంతమూర్తీ! ఈ రాజ్య మన్యాయముగా నా కంఠసీమను జుట్టితివా? భ్రాతృవత్సలా! నా మెడ కురిత్రాడై నను బోయకపోతివా? లక్ష్మణా! నీవే ధన్యుఁడవు. శ్రీరాముని వెన్నంటియే యుంటివి కదా! రామా! సుగుణస్తోమా! కళ్యాణనామా! పరంధామా! నీ వెం దుంటివి? ఓ భానుఁడా! సహస్రకిరణా! నీవు - నీవు - నీలో - మా రాముని

దాచితివా? లేకున్న నీ కట్టితేజస్సు కలుగునా? ఓ. వాయు దేవుఁడా? నీ వరుగనితలమే లేదు గదా. శ్రీరాముని నీ వెందును జూడలేదా? తెలుపరాదా? వాదా? భూదేవీ! నీవు మా రాముని యత్తవే కదా. ఏఁడీ మా రాముఁడు? గుణధాముఁ డేఁడీ? అయ్యో! యీ సమస్తదృశ్యప్రపంచమధ్యంబున మాకోదండరాముని జూడఁ దెలుపువారే లేరా? అయ్యో రామా! రామా!

ప॥ ఎపుడో రామా! నీ దర్శనం బో తారకనామా!

[వసిష్ఠుఁడు శతృఘ్నుఁడు ప్రవేశింతురు.]

(వసిష్ఠునిఁ జూచి పరుగిడుచు) ఓ రామా! మునివేషముఁ దాల్చితివా? నీ దర్శన మిచ్చితివా? నన్ను క్షమింపవా? నే నేపాప మెఱుఁగను, తండ్రీ! నీవే తండ్రివి (నమస్కరించి) శరణంటిని కాపాడవా?

వసి—(లేవఁదీసి) ఓ భరతా! మీ శ్రీరాముఁడు నారచీరలఁ దాల్చి సీతాలక్ష్మణులతోఁ గైకచేఁ దరుమఁబడి వనవాసమున కేగునపుడు బొమ్మవలెఁ గాంచుచున్న మీ గురువు ననియు వసిష్ఠుఁడ ననియుఁ జెప్పుకొనుటకు సిగ్గగుచున్నది, కుమారా!

భర—(ఆశ్చర్యముతో) ఆర్యా! మీరు గురువర్యులా? శ్రీరాముఁడు కాదా? (శతృఘ్నునివంకఁ జూచి) రామా! గురువుల వెన్నంటియే యుంటివా? నీవు శ్యామలవర్ణుఁడవు గదా! ఇట్లయితివేల? దుఃఖముచేతనా?

శతృ—సోదరా! నేను నీతమ్ముఁడను గదా! మనయన్న యడవుల కేగ లేదా? మనము రామునిఁ గొనిరా వనముల కేగ నిశ్చయింపలేదా!

భర—తమ్ముఁడా! నిజమే నిజమే. నాకంతయు రామమయముగా నుండుటచే నిట్లు భ్రమించితిని. గురువర్యా! పురవాసులం జేరి వనమున కేగుదమా?

వసి—భరతా! అట్లే కానిమ్ము.

భర—(తెరవంకఁ జూచి) ఓ అయోధ్యాపురవాసులారా! రామభక్తాగ్రేసరులారా!

సీ॥ భారతావనిఁ బుట్టి భారతీయులగుచుఁ
బ్రఖ్యాతిఁ గాంచిన పౌరులార!
ఈశార్పణమ్ముగా దేశాభివృద్ధికై
జీవంబు లర్పించు దివ్యులార!
రామావతారసార మెఱిఁగి రామవి
యోగంబునం గ్రుంగు యోగ్యులార!
ఆడి తప్పక యెన్నఁ డన్యాయ మెఱుఁగక
సంచరించెడి సత్యసంధులార!
గీ॥ విష్ణుభక్తులార! సుగుణవిబుధులార!
ధైర్యసంపన్నులార! సద్ధర్మలార!
రెండు! దండకాటవి కేగ రెండు! రెండు!
రండు! రామునిఁ గొనిరాఁగ! రండు! రండు.!

ఓధీమంతులారా!

సీ॥ అపహరింపను రాజ్య మర్పింతు నన్నకే
సూర్యచంద్రులు సాక్షు లార్యులార!
కైకపుత్త్రుఁడు వీఁడు కడుపాపి యనకుఁడీ
తలవాల్చియే యుంటి ధన్యులార!
ఏజన్మమందైన నీకఁబుట్ట నామెకుఁ
బుట్టను పుట్ట నో పూజ్యులార!
మీ రామదేవుని మీ రాజుఁగా జేసి
యడవి నుందును నేనె యయ్యలార!
గీ॥ రాముఁడే రాకయున్న సదవ్రతముఁ బూని
పురినిఁ జేరను నే నింక పూజ్యులార!
రెండు దండకాటవి కేగ రెండు! రెండు!
రండు! రామునిఁ గొనిరాఁగ రండు! రండు!

(పౌరులు ప్రవేశింతురు.)

పౌరు—భరతరాజేంద్రా! మేమును వచ్చుచుంటిమి, మేమును వచ్చుచుంటిమి.

భర—పౌరులారా! శ్రీరామకీర్తనముఁ గావించుచుఁ జని గుణరత్నాకరుండును, పరాక్రమోపేతుండును, దీనజనమందారుఁడును, కోదండధరుండును, శ్యామసుందరుండును నైన మన శ్రీరామునిఁ గొనివత్తము. శ్రీరామాయత్తమైన చిత్తములతో రండు.

[*ఎపుడో రామా" యను కీర్తనఁ బాడుచు నిష్క్రమింతురు.]

[తెరపడును.]

[రెండుమూడు తెరలనుండి పైకీర్తనఁ బాడుచుఁ బోవుదురు.]

4 వ రంగము.

[గుహుఁడు ప్రవేశించును.]

గుహు—(దూరమున భరతాదులఁ గాంచి) ఇటొచ్చేది బరతయ్యవబుద్దుఁడు కామోలు. అఁ! ఆమొగోడే. బుద్దిమంతురోలు కయికమ్మ సీరాములోర్ని వనాలపాలుసేత్తే మొనగాడు కొడుకు బరతయ్య మా దొరగోర్ని దుంపనాసనం సేయుటాన్కి చేనతో యెల్తున్నోఁడు! ఓరన్నా నా పేణాలతో చీరాములోర్ని తాకనిత్తానా ? (ఆలోచించి) ఐనా యేగిరం పాటు కూడదన్నారు పెద్దోళ్ళు. చంగతి తెల్సుకోవాల. (సమీపించి) ఎల్లు! ఎల్లు! యెక్కడికొత్తావు.

భర—(లజ్జతో తలవంచుకొనును.)

గుహు—నీ వయోర్యుద్దికి రాసోడ వయ్యావేం?

భర—హా దైవమా! యెట్టినిందల పాలైతిని!

గుహు—నీ యేసాల కేమిలే! ఎనకకు దారొట్టు.

భర—ఓ పుణ్యుఁడా! నేను శ్రీరామచంద్రుని వెదకుచుఁ బోవు చుంటిని.

గుహు—బుజ్జమీా దెట్టటానికా? అందుకే కాబోలీ చేన.

గీ॥ ఎందుకెల్తుంటి వీ వింత మందతోడ
కొండదేవతప్పై యొట్టుగొట్టి సెప్పు
సత్తెమాడక దొంగెత్తు కొత్తువేని
మీాటి పడదొబ్బగల్ను నక్టేట నిన్ను.

భర—శ్రీహరీ! పాపము శమించునుగాక. శ్రీరామభక్తాగ్రేసరా! నేనును నీవలెనే శ్రీరామభక్తాగ్రేసరుండను. మాశ్రీరామునిఁ దోడ్తొనివచ్చి పట్టాభిషిక్తునిఁ గావింపవలయునను తలంపున నుంటిని. నా తల్లి దౌష్ట్యములో నాకెట్టి సంబంధములేదు.

గుహు— సత్తెమే?

భర—ముమ్మాటికి సత్యమే!

గుహు—అల్లాగైతే దొరో! యెరక్క తప్పుసేశాను. తప్పట్టక యీా యూాల నాయిందారగించాల చామీా?

భర—విందు కేమిగాని పుణ్యుఁడా! మాశ్రీరాముఁ డెందు విశ్రమించెను. ఏమని తలపోసెను? తెలుపవా?

గుహు—అయ్యలూా! ఏమి సెప్పను. నీయన్నగో రిక్కడ దబ్బగడ్డి సాపమీాదే వొడుకొన్నారు. తలకట్టంతా మఱ్ఱిపాలతో అంటలుసేశారు. ఆరితితి సెప్పటానికి నోరెగయటం లేదు బాబూా.

భర—హా సోదరా! రామా!

సీ॥ ధారుణీసామ్రాజ్యధౌరేయమూర్తి! ద
ర్భాసనం బొక్క సింహాసనంబ?
అక్షౌహిణీసద్బలాధిక్యసంసేవ్య
ఘోరమృగాళులా? కొలిచె నిన్ను

సౌధాంతరాళసంసద్విహారవరుఁడ!
చేరినా వెట్టులు చెట్టునీడ!
తతహంసతూలికాతల్ప! హా శయ్యయా
జానేల? దిం డొకజాలిబండ?

గీ॥ వివిధమంగళశుభవాద్యవిపులసమ్మ
దావహావిశేషలలితవిహారరవళి
మేలుకొల్గను శ్రీరామ! మేలుకొంట
పక్షులకలకలముల నీపాపికొఱకు?

గుహు—అయ్యా! కంటతడెట్టిన ఫలం లేదు యిసారింపకు?

భర—ఓ పంచభూతములారా! నేనే కదా యీదుస్థితికిఁ గారణము. ఇదే నాశపథము శ్రీరామునిఁగొనివచ్చి పట్టాభిషిక్తునిఁ గావింప లేకున్న జటావల్కలధారినై దర్భశయ్యపై శయనించుచు బ్రహ్మచర్యవ్రతంబుఁ బూని యీపదునాల్గేండ్లును నయోధ్యలో పాదము మోపకుందునుగాక.

గుహు—అబ్బో! ఎంతలా వొట్టెట్టుకున్నావయ్యా బరతయ్యా! కానీ, గంగాబవానిని దాటటానికి పడవఁ దీత్తాను రండి.

భర—మిత్రమా! అట్లేపోవుదుము.

(గుహుఁడు భరతాదులు నిష్క్రమింతురు)

ఇది పంచమాంకము.



# శ్రీరామపాదుకలు.

## షష్ఠాంకము.

### 1 వ రంగము.

చిత్రకూటగిరి ప్రదేశము.

(శ్రీ సీతారామలక్ష్మణులు కూర్చుండి యుందురు)

శ్రీరా:—జానకీ! అయోధ్యాపురిని వీడినది మొదలు ఇట్టిబ్రహ్మానంద మునకుఁ దావలమైన చిత్రకూటమువంటి దివ్యతలముఁ గాంచ మైతిమికదా!

సీ॥ లేమావిచిగురులు లీలగా మెసవుచుఁ
గోకిల ల్గూయుఁగా కుహూకుహూలను;
గోనవ్రేళ్ల జందెము ల్గోని చిక్కుసడలించు
మునిబాలకులఁ జూడ ముచ్చటౌను;
ఆకులపై వ్రాలి యలరారు ఫలములు
వటపత్రశాయినే బళిర! పోలు;
జలపూరములలోని కలువపూవులజాలు
ముద్దుముద్దుగఁగాంచి మురియవచ్చు;
గీ॥ అలరు నీరెండజాడల నారపైవ
మెఱయు కాషాయవస్త్రంబు లరసినంత
చీనిచీనాంబరములపైఁ జింత లేదు
కైకభిక్షకదా! యిది కమలనయన!

సీత—నాథా! మీరనినట్లే చిత్రకూటమును వర్ణింప నలువకైనఁ దరముకాదు. అల్లదే యమ్మందాకినిం గాంచుఁడు.

(తెరలో కలకలము.)

లక్ష్మ—సోదరా! ఆ మహానినాదం బేమో కదా?

శ్రీరా—(విని) సమీపంబునంగల వృక్షమెక్కి కారణం బరయుదము.

(లక్ష్మణుఁడు నిష్క్రమించును.)

సీత—ప్రాణనాథా! ధ్వని యంతకంతకు సమీపించుచున్నదే!

శ్రీరా—ప్రియసీ! అట్లే యున్నది. చతురంగబలముల సవ్వడివలె నున్నది. ఏ రాజెవరిపై దండెత్తుచుండెనో?

సీత—వల్లభా! ఈ నిర్జనారణ్యమొక మార్గమానా?

శ్రీరా—నాకును నదియే సందియము. లక్ష్మణుఁడు వచ్చునుగదా! అంతయును దెలియును. తొందర యేల?

లక్ష్మ—(ఆందోళనముతోఁ బ్రవేశించి) అగ్రజా! అగ్రజా! ఏదో యొక గొప్పసైన్యము వచ్చుచున్నది. ధూళి యాకసమంటు చున్నది.

శ్రీరా—(చూచి) నిజమే తమ్ముఁడా! ఏరాజేంద్రుఁడో చతురంగ బలములతో నేతెంచుచున్నాఁడు. రానిమ్ము, తొందర యేల?

లక్ష్మ—(బాగుగఁ బరికించుచు) దేవా! ఇటే సైన్యము వచ్చు చున్నది. పతాక మొకటి మున్ముం దెగురుచున్నది. భరతుఁ డేమో కదా! (దృష్టి నిగిడ్చి చూచి) సోదరా! సోదరా! భరతుఁడే! భరతుఁడే! అన్నా! భరతుఁడే! కోవిదార కేతన మదిగో! -ఓరీ! భరతా! ఏమీ.! నీసాహసము! సోదర ప్రేమ మైనను లేక ఘోరవనములపాలు గావించినది చాలక మా రామునిపై దాడివచ్చుచుంటివా?

బేహాగ్ రాగము - చాపుతాళము.

ప॥ ఛీఛీ భరతా చిదిమెద శిరమున్ - చెండెద నీకండలు ఛీ ఖలుఁడా॥

నీచమతివినీ పాచికబడునా-నిలువునఁ జీల్చెద నిటరారా॥ ఛీ॥

రాజ్యము మ్రింగుట చాలకమా రామచంద్రునిన్ మ్రింగదలఁతువా

పూజ్యుని రాముని కాలిగోరు హా: పూజ్యుని రాముని కాలి గోరు దాకంగతరమ ఛీ! భాతృద్రోహీ॥ ఛీ॥

శ్రీరా—(లక్ష్మణునికరముఁ బట్టుకొని)

మ॥ ధరణీరాజ్యమె స్వర్గమే? లలితవాత్సల్యార్ద్రసౌశీల్యుఁడా
భరతుం డంతటిపాటిసేయఁడొకో; తద్భాగ్యంబులే కోరినన్
భరతా! రాజ్యము నిమ్ము తమ్ముని కనన్ వాఁ డిచ్చెడు న్ప్రీతితోఁ
ద్వరగాఁ జేరు మయోధ్య, నాకిటను బ్రాపై యుండు నాతండెపో!

లక్ష్మ—సోదరా! మరణావస్థయందును సంధ్యమంత్రములా?

శ్రీరా—లక్ష్మణా! భ్రాతను జంపువాఁ డొకభ్రాతయా? భరతుఁడు నన్ను రాజుఁ జేయఁగాఁ గొంపోవ నేతెంచుచుండె నేమో? ఇట్టి ప్రేమశూన్యంబులైన వచనంబులు పలుక నిన్ను సోదరుం డనవచ్చునా? రాజ్యభోగంబులే ప్రధానంబుగా నెంచితివేని అయోధ్యకే పొమ్ము, భరతుఁడే యిందుండును.

లక్ష్మ—(ఖడ్గము నేలవిడిచి) సోదరా నన్ను! క్షమింపుము. నీపైఁగల భక్తిచే దేహంబు మఱచి ప్రేలితిని. క్షమింపుము. నీదాసుఁడనే కదా.

శ్రీరా—తమ్ముఁడా! నిన్ను శాంతింపఁజేయుట కట్లంటిని గాని నీవాత్సల్యమే నెఱుంగనా?

(భరతశత్రుఘ్నులు ప్రవేశింతురు)

హిందూస్థానిముఖారిరాగము - చతురశ్రజాతిత్రిపుట.

ఇట్లుంటివ శ్రీరామచంద్ర! దయాసాంద్ర! రాజేంద్ర! మునివై
జటావల్కలములన్ దాల్చి నీ ॥విట్లుం॥

కఱకురాళ్ళపై ఘోరవనంబుల కాలుమోపుదు వాహా రఘురామా!
పరమపూతచరితా! గుణభరితా! జగన్నాథ! సార్వభౌమ!
అడవుల ॥ఇట్లుం॥

శ్రీరా—(భరతశత్రుఘ్నులఁ గౌఁగిలించి విడిచి) తమ్ములారా! దుఃఖతప్తులై తల్లిదండ్రుల విడిచివచ్చితి రేల? అట్లు రావచ్చునా?

భర—హా! సోదరా!

గీ॥ సత్యవాక్పాలనాంచితచక్రవర్తి
పుత్రవాత్సల్యసౌశీల్యపుణ్యమూర్తి
రాజ్యతంత్రసంపాలనరమ్యకీర్తి
లేఁడు మనతండ్రి మన కింక లేఁడు లేఁడు.

(సీతారామలక్ష్మణులు హాహాకారములు సేయుదురు)

శ్రీరా—హా తండ్రీ! మమ్ములను పెద్దలను గావించితివా?

సీ॥ విడలేక విడలేక విడనాడి న న్నీవు
భూలోకమే వీడిపోయినావ
భవదాజ్ఞఁ బాలింప వనిఁ జొచ్చితిని గాని
ని న్గంపుకొనుటకా నిర్మలాత్మ?
పదునాల్గువర్షముల్ వనములఁ గడపి నీ
పాదముల్ గొల్చెడి ప్రాప్తిలేదె?
కైకపై విసువున కాలునిపురి కేఁగ
మ మ్మెల్ల నీ వెట్లు మఱచినావు?

గీ॥ ఎట్టినక్షత్రకూటమిఁ బుట్టినానొ
ఎట్టిపాపంబుల న్మూటఁగట్టినానొ
తండ్రి మరణించునపుడైన దరిసిలేక
చెట్టుగుట్టల నీ రీతిఁ బట్టియుంటి.

లక్ష్మ—హా! తండ్రీ! నాయసందర్భప్రలాపంబులకే గుండెలు వ్రీలి మరణించితివా? తనయునితప్పులు క్షమింపలేక పోయితివా? జనకా!

వసి—శ్రీరామా! మృత్యుముఖమునఁ బడని నరుఁ డుండునా! నీ తండ్రికిని నీకును ఋణము తీరినది. ఎంత దుఃఖించిన నేమి ప్రయోజనము. రామా! నీవును లక్ష్మణుఁడును మీ తండ్రికిఁ దిలోదకంబులను విడువుఁడు.

శ్రీరా—గురువర్యా! మేము తండ్రిలేనివారల మైతిమికదా. తండ్రి మరణంబునకుఁ గారణభూతుండను నేనే కదా.

వసి—శ్రీరామా! నీతండ్రికిఁ గాలము తీరినది. ఇది యొకమిషయే కాని యాయువు దీరినవారినిఁ బ్రదికింపవలయు నన్నను బ్రదికింపఁగలమా? లెమ్ము. తిలోదకంబుల విడువుము.

శ్రీరా—(లేచి) తండ్రీ—

సీ॥ దాహంబుఁ దీర్పఁగాఁదగు జలంబులు లేక
యీతిలోదకముల నిడుదు నీకు
కలమాన్నమిడఁ జాలు కలిమి లేకుండుట
నీవారపిండంబు నేఁడు విడుతు
కట్టుబట్టలె నాకు గతి యాటచే నేఁడు
వస్త్రదానంబుల వదలివైతు
బంధువర్గంబుల బాసట నగలేక
జంతుజాలంబులచెంత నిలుతు

గీ॥ మనుమలను జెంత విడిచి నీమనసుఁ దీర్ప
లేక కన్నీటిధారల క్లిష్టదశను
నీదు పిత్రాత్మశాంతికై నేఁడు నేను
కాకములకై వెదకులాడఁ గదలిపోదు.

[సీతకాక మిగిలినవారు నిష్క్రమింతురు.]

సీత—నే నత్తింట మెట్టినవేళ యెట్టిదియోకాని నామనోహరునిజీవితము దుఃఖమయమై పోయినది కదా? నన్నేల సృజించితివి విధీ! ఎల్లకాలములందు జనకునివలెనే నాక్షేమ మారయుఁగోరు నామామగారు నాకు లేరా! అయ్యో! యెట్లు భరింపఁగలను!

అట్టిమామగారికిఁ గోడలనై యిట్టిమనోహరునకుఁ బత్నినై లక్ష్మణునివంటి మఱందులఁ గలిగిన నాజన్మమే జన్మమని తలఁచితినిఁగాని నే నొకదుఃఖదేవత్నై రఘుకులమును దుఃఖసముద్రమున ముంచివైతు నని యొకనాఁడైన తలంపనే? గాఢవాత్సల్యముగల తండ్రులకుఁ బుత్రులనుమాత్రమిచ్చి వారిసౌభాగ్యదశను గాంచునదృష్టము సీయకున్నఁ బ్రయోజన మేమి? దైవమా! నాపతినామాక్షరములనే స్మరించుచు మామగారు మరణించిరి కాఁబోలు. అహా! యెంతఘోర మెంతవిచారకరము. భరింపఁజాల, భరింపఁజాల.

[తెరపడును.]

---

[1 వ ర ం గ ము .]

[తెరయెత్తగా]

[శ్రీరామలక్ష్మణభరతశత్రుఘ్నులు, సీత, వసిష్ఠుఁడు ఆసీనులై యుందురు]

శ్రీరా—తమ్ముఁడా! భరతా! ధరాధినేతవైన నీ కీ విచార మేల తండ్రీ?

భర—సోదరా!

సీ॥ నల్లబండలపైన నాయన్న గూర్చుండ
బంగారుగద్దెపై వఱలఁగలనె?
నారచీరలఁ దాల్చి నాయన్న నడయాడ
రాచదుస్తుల నేను గ్రాలఁగలనె?
దిక్కులేక యడవిఁ దిరుగాడ నాయన్న
చతురంగబలముల సాకఁగలనె?
ఎండవానల కోర్చియుండంగ నాయన్న
హర్మ్యతలంబుల నందఁగలనె?

గీ॥ కలుషకర్కశపాషాణకంటకాన్వి
తభయదారణ్యదుర్భరతలములందు
సతినిఁ గేల్పట్టి నాయన్న సాగుచుండఁ
బట్టభద్రుండనై యెట్లు ప్రబలువాఁడ.

శ్రీరా—నాయనా! భరతా! నీ వట్టి చింతఁ బడయనేల?

ఉ॥ రాజవు నీ వయోధ్యకుఁ; రాజను దండక కేను; తమ్ముఁడా!
రాజిలు తెల్లగొడ్గునను; రాజిలుచుండెద వృక్షశాఖలన్‌ఁ;
పౌజులు లక్ష్మణానుజుఁడు బాసటయౌదురు నీ కయోధ్యలో;
భాజనలక్ష్మణుం డతులపౌరుషపున్నిధి యుండు నాకడన్.

భర—రామా! నీ వడవులనుండి నన్ను రాజ్య మేలు మనుట న్యాయమా?

బిల్హరిరాగము - చతురశ్రజాతి త్రిపుట.

నేనా రామా రాజగుట - నీ పాదాంబుజ నిరతాశ్రితుఁడను ॥నేనా॥

రానీ పోనీ కీర్త్యపకీర్తులు రారాజుఁగా నిన్నే చేతును ॥నేనా॥
అతి క్రూరవర కుకర్తృపుఁ గైకయు - నాశాలత తెగి వెల వెలఁ బోవఁగ
అతిమృదులములౌ నీ పాదము లే -నర్చించుచుఁ గొని చనియెద నన్నా ॥నేనా॥
మును సత్యహరిశ్చంద్రు డేలిన-పుణ్యభూమి నిఁక నేనా యేలుట
కని నిన్నా సింహాసనమున నా - కరముల నీ పాదములను బట్టెద ॥నేనా॥

శ్రీరా—తమ్ముఁడా! మన తండ్రి రాజ్యము నీకును, నరణ్యము నాకును విభాగముఁ జేయ, తనయులమై మన మంగీకరింప కున్న సమంజస మగునా?

భర—అన్నా! ఇది మనతండ్రిచేసిన విభాగమా? నా తల్లివిరుద్ధమే కదా?

శ్రీరా—నీ తల్లి వరములఁ గోరెను; మనతండ్రి వరబద్ధుఁ డయ్యెను.

శత్రు—తల్లి దుర్మతియై కోరెను; తండ్రి మోహాంధుఁడై చిక్కెను. మన మేల బందీకృతులము గావలయును?

లక్ష్మ—(తనలో) నా తమ్ముఁ డనిపించినాఁ డీశత్రుఘ్నుఁడు.
(ప్రకాశముగా) తమ్ముఁడా! వయస్సునకు బాలుఁడ వయ్యు బుద్ధికి బృహస్పతివే సుమా!

శ్రీరా—చిన్నతమ్ముఁడా! ఏతల్లి తనకుమారునిక్షేమాభివృద్ధిని గోరదు? దుర్మతి యననేల? ఏపతికి తనసతీమణిపై ననురాగ ముండదు? మోహాంధుఁ డననేల?

భర—అగ్రజా!

ఉ॥ కోరిక లేను గోరనిదె, కోరుట కెవ్వతె తల్లి సోదరా!
యారయ దండ్రికేమిపని యట్టివరంబులఁ దీర్పనెంచగా,
మీరుట కేమి యాజ్ఞ యిది; మించిన దేమిపు డెంచిచూచినన్
జేరు మయోధ్య కీవు, దయసేయుము, రాజ్యము, నేలు మగ్రజా!

శ్రీరా—తమ్ముఁడా!

ఉ॥ ఈ మనరాజ్యమే యనఁగ నేల? బహూత్తమరాజ్యసంపదో
ద్దామవికీర్తిసంకలితదారుణభూవలయంబు సర్వమున్
ధీమతుఁ డొక్కతమ్మునకు దీటగునే? నినుఁబోలువానికిన్;
ఈ మహితోరురాజ్యరమ నేలుము తప్పదు నీకుఁ దమ్ముఁడా!

శత్రు—

మోహనరాగము - చాపుతాళము.

మరలుద మయోధ్య కన్నా! రామా! ॥మర॥
అరనిముసము పురి నిలువఁగఁ గలమా-యరయక నిను దయార్ద్రహృదయా ॥మర॥
తండ్రి లేఁ డిఁకన్ దండ్రివి నీవే - యతులదయాసాంద్రా - నరేంద్రా ॥మర॥

ఉ॥ మంచియొ? చెడ్డయో? యొకటె మార్గముద్రొక్కుద మన్నలార! ధీ
రాంచితసార్వభౌముఁడయి హాళిని రాముఁడు రాజ్య మేలుటో,
వంచన మాని యందఱము భ్రాతృసమీపమునందు నుండుటో,
యెంచకుఁ డన్య మేదియును నేమరుపాటుననైన వేఁడెదన్.

శ్రీరా—తండ్రియాజ్ఞయే లేకున్నఁ దమ్ములకోర్కెఁ దీర్పకుందునా? తమ్ముఁడా! ఎట్లెట్లో యాపదునాల్గేండ్లును గడుపుఁడు. తదుపరి మీ చెంతనే యుందును గదా.

వసి—శ్రీరామా! సీతమ్మలు నిన్నెడబాసి యుండఁజాలరు కదా? నీ మానసము మరలించి యయోధ్యకు రారాదా?

శ్రీరా—గురువర్యా! సకలధర్మానుష్ఠానమతులగు మీ రిట్లుపలుకఁ బాడియా? పితాజ్ఞ యవిలంఘనీయము గదా!

వసి—నిన్ను దోష మంటకుండ నేఁ గాపాడెద. నీ వయోధ్యకు రమ్ము; పట్టాభిషిక్తుఁడవు గమ్ము; ఆనందము నిమ్ము. ఇంతకును నీ తండ్రి స్వబుద్ధితో నియమించినయాజ్ఞ కాదుగదా యిది? నీతండ్రి లేనే లేఁడు. కైకయుఁ బశ్చాత్తప్తయై వరముల విరమింప నున్నట. ఇం కెవరికొఱకీయాజ్ఞఁ బాలింతువు. నేను నీతండ్రికి గురువును, నీకును గురువును. నేను జెప్పినచొప్పునఁ జేయుము. నిన్ను పాప మంటనేరదు.

లక్ష్మ—గురువర్యా! మీ రీరీతిని మాజనకుఁడు మరణింపకమునుపే పలికిన నింత దుస్థితి కలుగకుండెడిది కదా! మీ కరుణావర్ష మీ నాఁటికిఁగదా మాపైఁ గురిపించుచుంటిరి.

శ్రీరా—గురువర్యా! తండ్రికి మించు గురువు గలఁడా?

ఉ॥ ఎన్నియొ యేండ్లు బూండ్లు జన నెన్నొ వ్రతంబుల సల్పి పుత్త్రులన్
గ్రన్ననఁ గాంచి, మోదమున రాగ మెలర్చుచు నన్నవస్త్రముల్
మన్నన నిచ్చుతండ్రి యొకమాటను బల్కినఁ జెల్లరాదొకో;
యన్నలుఁ దమ్ములు న్గురువు లారయఁ దండ్రిని మించు టెట్టులో.

భర—శ్రీరామచంద్రా! నీవే కదా నా కిఁకఁ దండ్రివి?

ఉ॥ కోరను రాజ్యసంపదలఁ, గోర రవంతయు నాధిపత్యముం,
గోర మహేంద్రభోగములఁ, గోరను కోరను స్వర్గమేనియుం,

గోరుదు నిన్ను రాజుగను, గోరుదు మాతను సీత రాణిగాఁ,
గోరుదు మీ పదాంబురుహకోరకయుగ్మసుసేవ, సోదరా!

శ్రీరా—తమ్ముఁడా! భరతా! మరల నా యాజ్ఞను దప్పుచుంటివి కదా.

భర—సోదరా! నా తల్లి మోసమే కాని నా తండ్రియాజ్ఞ కాదు గదా?

శ్రీరా—తండ్రియాజ్ఞమాట టటుంచుము. నేనే నిన్ను రాజుగా నియమించితిని. నా యాజ్ఞఁ బాపింతువా?

భర—అన్నా! నీ వయోధ్యకు రాని స్థిరసంకల్పుఁడవేని శత్రుఘ్ను నకుఁ బట్టముఁ గట్టి నీవెన్వెంట నుండుటకు నా కనుజ్ఞ నీయుము.

శత్రు—అన్నలారా! నేనే ద్రోహినా యట్టిశిక్ష విధింపఁబడుటకు?

శ్రీరా—తమ్ములారా! మీ రెన్ని పలికినను మనతండ్రిజీవాత్మ నూది గంటురాయివలె నన్నాకర్షించుచున్నది. నే నీయరణ్యవాసము నుండి విముఖుండను గాఁజాలను. నీవు మారాడక మరలి రాజ్య మేలుము.

భర—హా! శ్రీరామా! నీకరుణ నాపై రాదు గాదా. తల్లీ! జానకీ! నీవైనను గరుణింపవా?

ఉ॥ తల్లివి నీవె, నీపతియె తండ్రి, కుమారులముద్దుఁదీర్పఁగాఁ
దల్లియె తండ్రి వేడుటలు ధారుణి నెందును జూతుమే కదా;
తల్లిరో! తండ్రితోఁ బలుక ధైర్యము చాలదు గాన, నాకునై
చల్లఁగఁ జెప్పు మమ్మ, యిదె సాగిలి మ్రొక్కెదు నమ్మ జానకీ!

సీత—భరతా! నీవంటిమఱఁదినిగాంచి సంతసింతునా? మాపూర్వకర్మదుష్కృతమునుగూర్చి చింతింతునా? నాయనా! నీయందే దోసము లేదని యెఱుఁగుదుము. అయినను మాపదునాల్గేండ్లరణ్యవాసము మాకు తప్పదు కదా.

భర—తమ్ముఁడా! లక్ష్మణా! నీవే ధన్యుఁడవు గదా. నన్ను ను ధన్యుని జేయవా? మనసోదరునితో నాకై పలుకవా?

లక్ష్మ—అన్నా! నే నొకపాపాత్ముఁడను గదా.

ఉ॥ తిట్టితి నిన్ను, నీ జనని, దేహ మెఱుంగక మందబుద్ధినై,
తిట్టితి, దండ్రి సత్యగుణధీరుని దైవసమానుని న్గటా!
యిట్టి దురంతకుండ; నిఁక నేమని వేడఁగలాఁడనయ్య మీ
యట్టి విలాసధీమతుల, నర్హత లేదుగదా సహోదరా!

భర—హా! సీతారామలక్ష్మణులలో నొకరికైనను నాపై దయరాదు గదా? ఓ త్రిమూర్తులారా! ధీరోదాత్తుఁడును బ్రజానురంజకుఁడును, జ్యేష్ఠభ్రాతయునైన శ్రీరామచంద్రుఁ డడవుల మ్రగ్గుచుండ రాజ్య మేలునది నేనా? శ్రీరాముఁ డయోధ్య కేతెంచి పట్టాభిషిక్తుఁ డగునంతదనుక నే నాహారమును నీరమును గ్రోలక యిాదేయుండ నిశ్చయించి దర్భశయ్యలపై శయనించి, పుణ్యజలంబుల నంటి శపథముఁ జేయఁ బోవు చున్నాను. (పోఁబోవును)

శ్రీరా—(భరతునికరముఁ బట్టి) ఏమి నీ కీ వెఱ్ఱి. దివ్యమణిమయాలంకృతంబైన కిరీటము ధరించుభూపతి కిట్టి ఘోరవ్రతము చెల్లునా? నీవు దర్భల నంటకమునుపే న న్నంటి యిట్టి ఘోర వ్రత మాచరింపఁ బోనని పలుకకున్న మన తండ్రిప్రేతాత్మపై నాన సుమా.

భర—హా! రామా! మరణము నాశించుటకైన తరమా నీయాజ్ఞఁ బాలింపకుందునా?

గీ॥ తండ్రియాజ్ఞనే తీర్పంగఁ దలఁతు వేని
నీకు మాఱుగా నివసింతు నేను వనిని
రాజ్య మేలరాదయ్య యో! రామచంద్ర!
దేవ! కాపాడవా నన్ను దివ్యతముఁడ!

శ్రీరా—తమ్ముఁడా నీపట్టుమానుము.

గీ॥ భానుమండల మది చల్లఁబడిన సరియె
యింకిపోయిన నంభోధి నింకనిమ్ము
తండ్రియాజ్ఞ నే నుంతైనఁ దప్ప నింక
నిశ్చయం బిది ముమ్మారు నిశ్చయంబు.

నీ వయోధ్యకుఁ బొమ్ము. మాఱుపలికిన నాపై నాన.

భర—హా! సోదరా! నీ వింతదృఢప్రతిజ్ఞుండవైన నే నేమనఁగలను. దేవా! అట్లయిన పాపబంధవిమోచనములును మోక్షదాయకవిరాజితములును నైన నీపాదుకల నిమ్ము. నీపాదుకల సింహాసనమున నుంచి పట్టముఁగట్టి నీపేరుమీఁదుగా రాజ్యతంత్రము నడిపించుచుండెద. మఱియు.

చ॥ తిరిగి యయోధ్య కీవు చనుదెంచెడిదాఁక భుజింతు కందముల్;
ధరణి ధరింతు నారలను, దాల్తు జటల్, నివసింతు వెల్పలన్,
వఱలెడి పాదుక ల్గొలిచి పాలనసేతు, గణింతు నబ్దముల్
మరుదినమందె మ్రింగెదను మంటలఁ, దప్పదు నీవు రానిచోః

శ్రీరా—తమ్ముఁడా! అట్లే కానిమ్ము.

సీ॥ తల్లిపైఁ గినియక తగు భక్తితో నెప్డు
డంజలి మోడ్చియే యరయు మయ్య
నీ తల్లితోపాటు నా తల్లినిం జూచి
పుత్రదుఃఖముఁ బాపఁబూను మయ్య!
ఏ సత్యసిద్ధికై యీల్గెను మనతండ్రి
యా సత్యపథమునే యరయు మయ్య!
కన్నబిడ్డలఁబోలె నెన్ని పౌరుల నెల్ల
వేయికన్నులఁ గాంచి వెలయు మయ్య!

గీ॥ ఎట్టులో పదునాల్గేండ్లు నెట్టివైచి
మరుదినంబున నా రాక మరువఁబోక

నాలింగనం బీయ వెడలు మయ్యా!
మన కిటులు, వ్రాసె దుర్విధి మరలుమయ్యా!

భర—(శ్రీరామ పాదుకలు శిరముపై నుంచుకొని)

మం గ ళ హా ర తి .

కాఫీరాగము - ఆదితాళము.

ప॥ జయ మంగళం రఘురామా! జయ మంగళం గుణధామా!

అ॥ ప॥ రామా! శ్యామా! బలభీమా ॥జయ॥

చ॥ నిన్నే మది నే నెంతుఁ గటా యెన్నఁడిఁక నినుఁ జూతున్
మన్ననతో నే రాత్రిం బవలులు నెన్ని భజింతు
న్నీ పాదుకలఁ ॥జయ॥

(నిష్క్రమణము.)

[తెరపడును.]

ఇ. ది ప స్థాం క ము .

సమాప్తము.

## గ ద్య ము .

ఇది శ్రీభారద్వాజసగోత్రపవిత్రాపస్తంబసూత్ర కంభమ్మెట్టు
వేంకటసుబ్బారాయపౌత్ర శోభనాచలపతిరాయపుత్ర
సీతాపతిరాయనామధేయ ప్రణీతంబైన
'శ్రీరామ పాదుకలు' సర్వంబును

సంపూర్ణము.

---